# కళోద్ధారకులు

(దృశ్య నాటికలు)

అంగర సూర్యారావు




చౌదరి పబ్లికేషన్స్,
మండపేట. [తూ॥ గో॥ జిల్లా]

# మనవి.

— o —

కథానికలు, నాటికలు, నాటకాలు, నవలలు మొదలైన సాహిత్యశాఖలన్నిటిలోనుఉత్తమ రచనలను సేకరించి ప్రచురించాలని, వీలైనంత తక్కువధరలకు మంచి రచనలను అందివ్వాలని ఉద్దేశం.

ఆంధ్ర తెలంగాణాలు ఏకమౌతున్న యీ శుభసమయాన్ని మా ప్రచురణల ప్రారంభానికి సుముహూర్తంగాతీసుకుంటూ, నవ్యాంధ్ర దేశపు నాల్గుమూలలనుంచి మాకు ప్రోత్సాహం లభిస్తుందని ఆశిస్తున్నాం.

| | |
|---|---|
| మండపేట | యం. యస్. చౌదరి. |
| 30—4—56 | సంపాదకుడు. |

# పాత్రలు

1. ఇందిర
2. గోపాలం
3. అధికారి
4. రాఘవరావు
5. శాస్త్రి
6. సుబ్బారాయుడు

18—2—56 తేదీని విశాఖపట్నంలో ప్రదర్శింపబడినప్పటి

# నటవర్గం

---

| | |
|---|---|
| గోపాలం:— | ఎ. కృష్ణారావు |
| రాఘవరావు:— | టి. యస్. గిరి |
| శాస్త్రి:— | యం. సోమగిరిశాస్త్రి |
| అధికారి:— | జె. సన్యాసిరావు |
| సుబ్బారాయుడు:— | జి. మారుతిరావు |
| ఇందిర:— | పి. కృష్ణారావు |
| సంగీతం:— | టి. యస్. ప్రకాశ్ |

దర్శకత్వం:- గణపతిరాజు అచ్యుతరామరాజు బి. ఏ. బి. యల్.,

(విశాఖనాటక కళామండలి, అధ్యక్షులు.)

# దేశ దిమ్మరులు



స్థలం:- విశాలమైన హాలు — సమయం. ఉదయం 9గంటలు. ఒక టేబిలు—టేబిలుకు తిన్నగా రెండుకుర్చీలు—హాలుమధ్య ఒకసోఫా వున్నాయి. టేబిలుమీద ఆఫీసు రికార్డులు, ఫైల్సు పేర్చివున్నాయి. ఇందిర సోఫాలో పడుకొని సినిమాపత్రిక పేజీలుతిప్పుతూ పాటపాడుతూవుంది. వయస్సు 18 సంవత్సరాలు. ముఖంలో నిర్లక్ష్యం కనిపిస్తూవుంటుంది. కుడివైపునుంచి గోపాలం నెమ్మదిగా వచ్చి టేబిలుమీద రికార్డులు సర్దుతున్నట్లు నటిస్తూ పాటవింటున్నాడు. వయస్సు 25 సంవత్సరాలలోపు. తెల్లని అతుకుల షరాయి. చొక్కా-నల్లనిటోపీ—చూడగానే ఆఫీసు బంట్రోతుఅని తెలుస్తుంది.

ఇందిర:_ (పాట)

కన్నె తొలివలపులో<br>
కన్నిటి తలపులో<br>
మెరుపొకటి మెరిసిందిలే!<br>
చిరుగాలి వీచిందిలే!<br>
మొగిలుకన్నియ ఒకతె<br>
మొగపురేఖను చూచి<br>
కనుమూసి తెరచింది లే!<br>
చిరునవ్వు విసిరింది లే!

గోపాలం:-పాటబాగుంది. అమ్మాయిగారూ!

ఇం:-(లేచి వెనుకకు తిరిగిచూచి) నువ్వా యిక్కడే వున్నావా? ఏంచేస్తున్నావ్?

గో:-(వినయంగా) టేబిలు సర్దుతున్నానండి.

ఇం:-నేను పాటపాడే సమయంలో దొంగలావచ్చి నుంచున్నావా?

గో:-లేదండి. మీరుపాడుతున్నప్పుడే నేనువచ్చాను. సద్దుఅయితే మీరు కోపపడతారని సవ్వడికాకుండా నాపని చేసుకుంటున్నాను.

ఇం:-పాటవింటూ పనిచేస్తున్నావా? వినకుండా చేస్తున్నావా?

గో:-చెవులు సరిగా వున్నప్పుడు వినకుండా చెయ్యడం ఎలాసాధ్యమండీ?

ఇం:- వినినవాడవు నోరు మూసుకుని వూరుకోక 'కామెంటు' ఎందుకు? నీఅభిప్రాయం ఎవరడిగారు?

గో:-మీకంఠం చాలాబాగుందండి, ఆగలేక పైకి అనేశాను. ఇంకెప్పుడూ అననులెండి.

ఇం:-నీకు సంగీతంవచ్చునా?

గో:-నాకు సంగీతంవస్తే బంట్రోతుఉద్యోగంఎందుకు చేస్తానండీ? హాయిగా ఏసినీమా కంపెనీలోనో ఏనాటకకంపెనీలోనో చేరిపోయి వుందును.

ఇం:-సంగీతం రానిదే నాపాట బాగుందని ఎలా చెప్పగలిగావ్?

గో:—బాగుందండోయ్ అమ్మాయిగారూ! పాటవిన్నప్పుడు దారినిపోయే దానయ్య అయినా బాగున్నదీ లేనిదీ చెప్పేస్తాడు. ఈమాత్రందానికి సంగీతంకూడా రావాలా?

ఇం:—మంచిజవాబే చెప్పావు.—అవతలవైపువరండాలో జోళ్ళువిడిచి పెట్టివచ్చాను. తీసుకువచ్చియిక్కడ పెట్టు. (గోపాలం వెళ్ళబోతూవుంటాడు.) ఏయ్ గోపాలం!

గో:—(వెనుకకువచ్చి) ఎందుకు అమ్మాయిగారూ?

ఇం:—నేను జోళ్ళుతీసుకురమ్మన్నందుకు నీకుమనసులో కష్టంగా లేదూ?

గో:—ఆత్మాభిమానాన్ని చంపుకోకపోతే యీరోజుల్లో ఉద్యోగాలు చెయ్యలేం అమ్మాయిగారూ! ఆఫీసులో పనులు చెయ్యడానికి, ఆఫీసు రికార్డులు మొయ్యడానికి ప్రభుత్వం బంట్రోతులను నియమించింది. అధికారులుమాత్రం జోళ్ళు మొయ్యడానికి, యిళ్లుతుడవడానికి, నీళ్లుతోడడానికి బంట్రోతుల్ని ఉపయోగించుకొంటున్నారు. నాలాంటి అల్పుడొకడు ఎదురు తిరిగినంత మాత్రాన పరిస్థితులు మారిపోవు. పైగా వున్న వుద్యోగం కాస్తా ఊడిపోతుంది.

ఇం:—నీకు మంచి ఉపన్యాసధోరణివున్నట్లుంది. బాగా చదువుకున్నవాడిలా మాట్లాడుతున్నావ్. ఏంచదివావ్?

గో:—బంట్రోతుకు చదువెందుకండీ? థర్డుఫారం దాకా చదివాను.

ఇం:—పాపం! నీకేడబ్బువుండి కనీసం ఇంటర్మీడియట్ వరకూ చదివినా, మంచివుద్యోగం దొరికివుండేది.

గో:—ఆరోజులు వెళ్ళిపోయాయి. ఇప్పుడు చదువుకు విలువపూర్తిగాపోయింది. ఎంతచదువుకున్నా ఉద్యోగాలు దొరకడంలేదు. పోయి జోళ్ళుతీసుకువస్తాను. (పోబోతాడు)

ఇందిర:—వద్దుగోపాలం! నువ్వు యివేళనుంచి అటువంటిపనులు చెయ్యొద్దు. యిన్నాళ్ళూ నీతో అలాంటిపనులు చేయించినందుకు నేను విచారిస్తున్నాను.

గో:—(ఆశ్చర్యంతో )యివాళమీలో ఏదో మార్పు కనిపిస్తోంది.

ఇం:—ఇందాకవచ్చిందిచూశావూ- నాస్నేహితురాలు శ్యామ!

గో:—ఏం పేరండీ?

ఇం:—(హేళనగా) ఆ పేరుకూడా నువ్వెప్పుడూ విన లేదన్నమాట? పాపం!

గో:—లేదండి! ఆవిడను నేను యెప్పుడూ ఎక్కడా చూసినట్లుకూడా లేదు.

ఇం:—శ్యామ యిక్కడ వున్నంతసేపూ దొంగలా తప్పించుకు తిరిగేవెందుకు?

గోపా:—అమ్మగారు పనిచెపితేచూస్తూ వుండిపోయాను

ఇం;—నువ్వు యిక్కడకు వచ్చి పొంచి చూచి వెళ్ళ లేదూ?

గోపా:—మీరు వింతగా మాట్లాడుతున్నారు.

ఇం:—నీకు నామాటలలో వింత కనిపిస్తూవుంటే నాకు

నీచేష్టలలో వింతకనిపిస్తోంది. శ్యామ నిన్నవరండాలోకలుసు కున్నప్పుడు—ఆమెనిన్ను పిలుస్తున్నా—అక్కడి నుంచి ఎందు కంత తొందరగా పోయావ్?

గోపా:—ఏదో పనిమీద వెళ్ళిపోయివుంటాను.

ఇం:—నాదగ్గర యింకా దాస్తావెందుకు? శ్యామనాకు అంతాచెప్పింది. యిప్పటికైనా నిజంచెప్పు. లేకపోతే నేను నాన్నగారితో అంతా చెప్పేస్తాను.

గోపా:—(విచారంతో) ఏంచెప్పను అమ్మాయిగారూ! కళాకారుడు కళాకారుడిగా బ్రతకడానికి యీ ప్రపంచంలో ఆస్కారం లేదు. బ్రతుకు తెరువుకోసం ఏపనైనా చెయ్యడానికి సిద్ధపడాలి. శ్యామకూ, మరోయిద్దరుఅమ్మాయిలకూ సంగీత పాఠాలు చెప్తున్నాను. వారు నలభై రూపాయిలు యిస్తారు. బంటోతుగా నాజీతం నలభై రూపాయిలు. యీ ఎనభై రూపాయిలతో జీవితాన్ని దొర్లించుకు వస్తున్నాను.

ఇం:—సంగీతంవస్తే సినిమాకంపెనీలోనో నాటకకంపెనీలోనో చేరుదునన్నావుకదూ?

గో:—మాటవరసకు అలాఅన్నాను. సినీమాలలో నా లాంటి కొత్తవాళ్ళకు చోటులేదు. నాటకకళ దేశంలో వెనుకబడిపోయింది.

ఇం:—అందుకోసం నికృష్టమైన జీవితాన్ని సాగిస్తు న్నావా? మానాన్నగారితో చెప్పి నీకేమైనా సహాయం చేయిస్తానుండు.

గో:-(బ్రతిమాలుతూ) దయచేసి మీ నాన్నగారికి యిదేంచెప్పకండి. వున్నవుద్యోగంకూడా తీసెయ్యగలరు.

ఇం:-నువ్వు నిజంగా ధర్మశాస్త్రం వరకేచదివేవా?

గో:-అంతేనండి. ధర్మశాస్త్రంపాసయి సంగీతం నేర్చుకున్నాను. జీవితం గడవక కన్నతల్లినీ, వున్నవూరునూ వదలిపెట్టి యిక్కడ యీవిధంగా బ్రతుకుతున్నాను.

ఇం:-యిన్నాళ్ళూ నీచేత హీనమైన పనులు చేయించినందుకు విచారిస్తున్నా గోపాల్!

గో:-యికముందుకూడా మీరు ఎటువంటి పనులు చెప్పినా చెయ్యడానికి నాకేం అభ్యంతరంలేదు. కాని నా గురించి మీనాన్నగారికి చెప్పకుండావుంటే చాలు.

ఇం:-అందుకొక షరతువుంది.

గో:- మీరేంచెప్పినా వింటాను.

ఇం:—అయితే ఒక పాటపాడు.

గో:—(భయంతో)యిక్కడపాటపాడడమే! మీనాన్నగారువస్తే నాఉద్యోగం పోతుంది.

ఇం:—అదేం లాభంలేదు. కారుచప్పుడుకాగానే పాడడంమానవచ్చు. అమ్మ మేడమీద సామాన్లు సర్దుతోంది. ఆలస్యం చెయ్యకుండా పాటపాడివినిపించు. పాడకపోతేనాన్నగారితో అంతా చెప్పేస్తాను.

గో:—(వీధివైపు ఒకసారి బెదురుగాచూచి విధిలేక పాడడం ప్రారంభిస్తాడు)

పూలంటే యిష్టంకాదా!
పూలన్నీ నీవేకాదా!
రంగు రంగుల పూలపై
చెంగు చెంగున దూకుతు
కమ్మని పాటలు పాడే
తుమ్మెద గుంపులు అవిగో!
పూలంటే వాటికి యిష్టం
పూలంటే నీకూ యిష్టం
మత్తెక్కించే వాసనలు
మైమరపించే సమయంలో
పూదోటలలో విహరిస్తే
పూబాటలలో పయనిస్తే
యీ భువి ఒక స్వర్గంకాదా?
భువికంటే స్వర్గం కలదా?
పూలంటే యిష్టంకాదా?
పూలన్నీ నీవే కాదా?

ఇం:—(సంతోషంతో) హాయి! హాయి! చాలా బాగుంది పాట—— యీ రోజునుంచి నువ్వేంచెయ్యాలో తెలుసా? వీలు చిక్కినప్పుడల్లా నాకు పాటలుపాడి వినిపిస్తూవుండాలి.

గో:—నాఉద్యోగంమాని ఆటలు పాటలతో యిక్కడ కాలం గడిపితే నామర్యాదదక్కదు అమ్మాయిగారూ.

ఇం:—నువ్వీవుద్యోగం చెయ్యడం నాకెంతమాత్రం యిష్టంలేదు.

గో:—నాకూ యిష్టంలేదు.

ఇం:—అటువంటప్పుడు యీ వుద్యోగం విడిచిపెట్టి మరోపరువుగల ఉద్యోగం ఎందుకు చెయ్యకూడదు?

గో:—దొరికితేకదూ చెయ్యడానికి? యింతకంటే తేలికగా దొరికే ఉద్యోగం నాకేదీ కనిపించలేదు.

ఇం:—పోనీ సంగీత పాఠశాల ఒకటి స్థాపించకూడదూ?

గో:—పూర్వం ఆడపిల్లలు విధిగా సంగీతం నేర్చుకునేవారు. కాని యీ కాలపు ఆడపిల్లలు మొగపిల్లలతో పోటీపడి ఉన్నతవిద్యలకోసం—కళలకు స్థానంలేని — కళాశాలలకు ప్రయాణం అవుతున్నారు. యీపరిస్థితులలో నేనుసంగీతపాఠశాల స్థాపిస్తే యింటిఅద్దెకూడాకిట్టదు.

ఇం:—(క్షణంఆలోచించి) పోనీ యీఉద్యోగం చెయ్యనక్కరలేకుండా నీజీవితం సుఖంగా గడిచే ఉపాయం ఒకటి నేను చెబుతాను వింటావా?

గో:—(సంతోషంతో)అంతకంటేనాకు కావలసింది...

(బైట కారుహారన్ చప్పుడువిని మాటమధ్యలోఆపుజేస్తాడు) బాబుగారు వచ్చారు. వస్తానమ్మాయిగారు. (తొందరగా కుడివైపునిష్క్రమిస్తాడు. ఇందిర సోఫాలో కూర్చుని పత్రిక పేజీలు తిప్పుతూ వుంటుంది. కుడివైపు నుంచి ముందు అధికారి—వెనుక 'ఆఫీసు రికార్డు బాక్సు' తలమీద పెట్టు

కుని గోపాలం ప్రివేశిస్తారు. అధికారి లావుగా పొడవుగా వున్నాడు, ఫుల్ ఫాంట్, బుష్కోట్ వేసుకున్నాడు. ముఖం లోచిరాకు; కోపం కనిపిస్తూ వుంటాయి. వయస్సు 45 సంవత్సరాలు.)

అధికారి:॥(హేట్ తీసి టేబుల్ మీద పెట్టి) ఇందిరా! ఒక గ్లాసు కాఫీ తీసుకురా అమ్మా.

ఇం:—ఇవేళ యింత ఆలస్యమయ్యిందేం నాన్నా?

అధి:—రోజులు మునుపటిలా లేవమ్మాయ్. కాలం మారిపోయింది. బ్రిటీష్ గవర్న మెంటు వుండే రోజులలో ఏ గుమాస్తా అయినా ఎదురు తిరిగితే ఉద్యోగంలోంచి డిస్మిస్ చేసి పారేసేవాళ్ళం. ఇప్పుడేముంది; బంట్రోతు దగ్గర నుంచి ప్రతీవాడూ ఎదురుజవాబు చెప్పడమే! ఒక్కడూ సరిగా పని చెయ్యడు. దగ్గరవుండి కూర్చుని పనిచేయించి వచ్చే సరికి యింత టైమయ్యింది.—ఒరేయి గోపాలం— బొక్సులో కాగితాలుతీసి టేబిలుమీద పెట్టక్కర్లేదూ? అదికూడా చెప్పాలా? (కోపంతో) నీకు తలకాయలేదురా?

ఇం:—(నవ్వుతూ) తలకాయ లేకుండా తలకు టోపీ ఎలా పెట్టుకున్నాడు నాన్నా? (ఎడమవైపు వెళ్ళిపోతుంది)

అధి:—వట్టి ఆకతాయితనం. ఏమాటఎప్పుడనాలోకొంచెంకూడా తెలియదు. (కుర్చీలోకూర్చుని) ఒరేయి గోపాలం! 'డి' సెక్షను గుమాస్తాని రమ్మన్నాను. రాలేదటొ్రి?

గో:—యింకారాలేదండి.

అధి:—వెనుక బ్రిటిషుప్రభుత్వపు హయాంలోగుమస్తా లందరూ నాయింటిముందు పడిగాపులు పడి కూర్చునేవారు యిప్పుడురమ్మని ఆర్డరు వేసినా రావడంలేదు. వీళ్ళమీద కఠినశిక్షణ చర్యతీసుకోవాలి. లేకపోతే నేను ఉద్యోగం చెయ్యలేను.

గోపా:—వెళ్ళి ఆగుమస్తాగారినిపిలుచుకురమ్మంటారా?

అధి:—(కోపంతో) ఎప్పుడు అవకాశం దొరుకుతుందా ఎప్పుడు బయటకు పోదామా అనినువ్వు కాచుకు కూర్చుంటావ్! పిలుచుకు వస్తాడట!

గోపా:—(వినయంగా) ఉదయం ఏడుగంటలనుంచి దీపాలు పెట్టేవరకూ యిక్కడే వుంటున్నానుసార్. తప్పించుకు పోవాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు.

అధి:— (కోపంతో) ఆ తలబిరుసే కూడదన్నాను. మాటకుమాట శపీమని జవాబు చెప్పెయ్యడమే! పెద్దంతరం చిన్నంతరం కొంచెం ఉండక్కర్లేదూ? ఏమైనా అన్నప్పుడు నోరుమూసుకుని వూరుకోవాలి.

గో:—చిత్తం! అలాగే సార్!

అధి:—(కాగితాలు తిప్పుతూ) ఒరేయి గోపాలం! గుమస్తాలందరిలోనూ 'డి' సెక్షను గుమస్తాఅంత పొగరుబోతు మరొకడెవడూ లేడు.

గో:—(ఆశ్చర్యంతో) అలాగటండీ! నేనింకామంచో రనుకుంటున్నాను.

అధి:—వాడు అందరిలోనూ నన్నొకసారి ఎదిరించేడు. అప్పుడు నువ్వూ వున్నావుకదూ?

గో:—వున్నానండి. మీరేదో అంటే ఆయన ఏదో జవాబు చెప్పేడండి.

అధి:-దానినేఎదిరించడం అంటారు. వాడిమీద 'ఇన్ సబార్డినేషన్' క్రింద చర్య తీసుకోవాలనుకున్నాను.

గో:-ఆయన గుమస్తాల సంఘానికిసెక్రిటరీ అండి.

అధి:-అయితే ఎవడికిరా భయం!— వెధవ కాలం! బొత్తిగా తగులబడిపోతోంది. మిల్లులోపనిచేసే కూలివాళ్ళకీ సంఘమే; బడిలో చదువుకునే కుర్రకుంకలకీ సంఘమే! సినిమాలు తీసేవాళ్ళకు ఒక సంఘం—చూసే వాళ్ళకు మరో సంఘం. బ్రిటిష్‌వాళ్ళు పోయిన తరవాత రోజులు మరీ ఘోరంగా వున్నాయి_దేశంలో ఏమూలచూసినా సమ్మెలు, సభలు, ఆందోళన, అలజడి.

(యింతలో బైట పెద్ద కలకలం వినిపిస్తుంది. మనుష్యుల కేకలు, మాటలు వినిపిస్తాయి. "నిరుద్యోగుల సంఘానికి—జై!" అని చెవులు చిల్లులు పడేలా నినాదం వినిపిస్తుంది. అధికారి, గోపాలం ఆతురితతో వీధివైపు చూస్తారు.)

గో:—వాళ్ళెవరో మన యింటిముందే వున్నారండి.

అధి:—(భయంతో) మన యింటి ముందెందుకురా బాబూ యీ గోల? వాళ్ళెవరో, ఎందుకు వచ్చారో కనుక్కుని రా!

(గోపాలం కుడివైపు నిష్క్రమిస్తాడు. బయట కోలాహలం యింకా ఎక్కువవుతుంది. అధికారి చిరాకుతో గదిలో అటూ యిటూ తిరుగుతూ వుంటాడు. రెండు నిమిషాల తరవాత కుడివైపు నుంచి తిరిగి గోపాలం వస్తాడు.)

గో:-మీరేదో ఉద్యోగానికి ఖాళీ వుందని పేపర్లో ప్రకటించారట కదండీ?

అధి:—అయితే?

గోపా:— ఆ ఉద్యోగం కోసం వచ్చారటండి.

అధి:—ఎందరుంటారు?

గో:—సుమారు వందమంది వుంటారండి.

అధి:—(ఆశ్చర్యంతో) అరే! ఒక గుమస్తా ఉద్యోగం కోసం వందమందికి పైగా వచ్చారా?

గోపా:—చిత్తం!

అధి:—(కోపంతో) వాళ్ళందరినీ ముందు యిక్కడ నుంచి పొమ్మను. యిదేం గవర్నమెంటు వ్యవహారం అనుకున్నారా? సినిమా కంపెనీ అనుకున్నారా? ఒక్క చిన్న ఉద్యోగానికి వందమందికి పైగా వొచ్చారట! ఎక్కడా "డిసిప్లిన్" లేదు.

గో:-అందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పేస్తానండి.

(కుడివైపు వెడతాడు. బయట కలకలం యింకా ఎక్కువవుతుంది. "మేం వెళ్ళం"—'మాలో కనీసం ఒకడికైనా ఉద్యోగం యివ్వాలి.'— నిరుద్యోగుల సంఘానికి—జై'—

కేకలు నినాదాలు వినిపిస్తూవుంటాయి. అధికారి అశాంతిగా గదిలో తిరుగుతూ వుంటాడు. ఎడమవైపునుంచి కాఫీగ్లాసు తీసుకొని తొందరగా ఇందిర వస్తుంది.)

ఇం:-(ఆత్రంగా) ఏమిటినాన్నా యీ గోల?

అధి:—(చిరాగ్గా) ఏమీలేదు. ఒక ఉద్యోగంకోసం వందమంది దౌర్భాగ్యులు తగులడ్డారు.

(కుడివైపునుంచి గోపాలం వస్తాడు.)

గో:—ఎంత చెప్పినా వినడంలేదు సార్! కొందరు నాకేసి చూడనైనా చూడలేదు. వాళ్ళలో ఒకడికైనా ఉద్యోగం యిస్తేకాని వెళ్ళిపో మంటున్నారు.

అధి:-(కోపంతో) వెళ్ళరూ? మర్యాదగా వెళ్ళకపోతే పోలీసు స్టేషన్‌కు ఫోనుచేస్తానని చెప్పు. లాటీకర్రలు, మెడ మీదపెట్టి బయటకు గెంటిస్తానని చెప్పు.

ఇం:—పోనీ వాళ్లలో ఒకడిని సెలక్టు చెయ్యకూడదూ నాన్నా !

అధి:- నీకీవిషయాలేం తెలియదమ్మా! నువ్వు లోపలికి పో! (గ్లాసు టేబిలుమీద వుంచి ఇందిర ఎడమవైపువెళ్లిపోతుంది.)

గో:-మా దొరగారికి కోపంవస్తే వూరుకోరని నేను వాళ్లకు చెప్పేను సార్!

అధి:—చెబితే ఏమన్నారు?

గోపా:-మీదొరగారికి కోపం మీామీద పని చేస్తే

చెయ్యొచ్చు కాని మామీాదేం పనిచెయ్యొదని చెప్పేరండి.

అధి:— (కోపంతో) వెధవకాలం! ప్రతి నిర్భాగ్యుడు తిరుగుబాటు చెయ్యడం నేర్చుకున్నాడు. నాలా బాగా బ్రతికినవాడికి ఉద్యోగం చెయ్యడానికి రోజులు కావివి. — ఒరే గోపాలం! రోజులు సరిగా లేనప్పుడు మనం ఏమీాచెయ్యలేం. రేపు మధ్యాహ్నం ఒంటిగంటకు ఆఫీసుకు రమ్మని వాళ్ళకు నచ్చచెప్పు. —ఆఫీసంటూ ఒకటి ఏడ్చినప్పుడు వాళ్ళంతా నాయింటిమీాద ఎందుకు దండయాత్ర చెయ్యడం?

గో:—(వినయంగా) వాళ్లు నా మాటలు వినిపించుకోవటం లేదు. సార్! వాళ్లగోడవేదో వాళ్లది. యింతమంది నిరుద్యోగులు ఒక్కచోట కలుసుకున్నందుకు యీ అవకాశాన్ని వృధాగా పోనివ్వరట. అందుకోసం మనయింటిముందు ప్రార్థన చేస్తున్నారు. వినండి!

(నేపథ్యంలోంచి బృందగానం వినిపిస్తూ వుంటుంది. అధికారి కాలు కాలిన పిల్లిలా గదిలో తిరుగుతూ వుంటాడు. గోపాలం పాట వింటూ పెట్టెమీాద పాటకు ఉయగా తాళం వేస్తూ వుంటాడు.)

బృందగానం:—

నిరుద్యోగులం-మేం నిరుద్యోగులం
నిస్పృహతో తిరిగే నిరుద్యోగులం
కావాలండీ మా కొక ఉద్యోగం
కనీసప్పు కోరిక ఒక ఉద్యోగం

సేతు శీత నగపర్యంతం తిరిగాం
కేవలం మా ఉద్యోగాల కోసం
లేదండీ ఉద్యోగాలకు ఖాళీ
ఏం చెప్పం మా బ్రతుకే ఒక మోళీ
యిస్తారా ఉద్యోగం యివ్వండి
యివ్వక పోతే యివి మా కందించండి
తిండి, బట్ట వస్త్రా అన్నీ పెట్టి
చేతికి యివ్వండొక సిగరెట్ పెట్టి
నిరుద్యోగులం—మేం నిరుద్యోగులం!

(పాట ఆగుతుంది. పెద్ద నినాదాలు హాలు ప్రతిధ్వనించేలా వినిపిస్తూ వుంటాయి—'ఆంధ్రరాష్ట్రం—వర్ధిల్లాలి' —'అధికారుల దౌర్జన్యం నశించాలి!'—'నిరుద్యోగ రాక్షసిని—హతమార్చాలి'—'ఉద్యోగం—మా జన్మహక్కు'—'నిరుద్యోగుల కనీసపు కోర్కెలు—తీర్చాలి—.' 'నిరుద్యోగుల సంఘానికే జై!'—ఎడమనైపునుంచి ఇందిర వస్తుంది.)

ఇం;—వాళ్ళ బృందగానం చాలా బాగుంది కాదూ గోపాల్!

అధి:—(కోపంతో) ఛ! ఛ! యీ కాలపు పిల్లలికి కొంచెం మంచి చెడ్డలు తెలియవు. ఎంతటి సీరియస్ ఘటననుకూడా నవ్వులాటగా తీసుకుంటారు—వాళ్ళను ఎలా వదల్చుకోవడంరా దేవుడా అని నేను బుర్రబద్దలు కొట్టుకుంటూ వుంటే—పాట బాగుందట! పాట!!

(క్రోధంతో బయటకు చూస్తూ వుంటాడు. గోపాలం, ఇందిర ఒకరికేసి ఒకళ్లుచూచి నవ్వుకుంటారు.)

ఇం:—నిన్ను అమ్మ రమ్మంటోంది గోపాలం!

గోపా:—(అధికారితో) అమ్మగారు పిలుస్తున్నారట! వెళ్లొస్తానుసార్!

అధి:—(పరధ్యానంగా) ఊఁ.

ముందు ఇందిర వెనుక గోపాలం ఎడమవైపు వెళ్ళిపోతారు—బయట కోలాహలం తగ్గింది; ఒక యువకుడు కుడివైపు నుంచి ప్రవేశిస్తాడు. మాసిన ఫుల్ పాంటు; చిరిగిన చొక్కా, కొద్దిగా పెరిగిన గెడ్డం, చింపిరిజుత్తు, వయస్సుకు 24 సంవత్సరాలు.)

యువకుడు:—(అధికారిని సమీపించి) నమస్కారం:

అధి:—ఎవరు నువ్వు?

యువ:—మీ ఆఫీసులో ఒక ఉద్యోగానికి ఖాళీవున్నట్లు మేంపేపర్లో చూశాం. ఆంధ్రదేశపు నలుమూలల నుంచి మేం—అనగా నిరుద్యోగులం——నూట నలభైమంది వచ్చాం.

అధి:—ఒక ఉద్యోగానికి నలుగురికంటె ఎక్కువమందికి ఇంటర్వ్యూయివ్వం.

యువ:—మీరు యివ్వకండి. మానండి మీప్రకటనవల్ల మాకుఅపూర్వమైన అవకాశం చేకూరింది. మేం యింతమంది యిక్కడ కలుసుకొన్నందుకు సంతోషించి పవిత్రమైన మీగృహ ప్రాంగణంలో మేంనిరుద్యోగుల సంఘాన్ని స్థాపిం

చాం. సభ జరుపుకున్నాం. నా సోదర నిరుద్యోగులంతా నన్ను ప్రతినిధిగా ఎన్నుకొని ఉద్యోగం గురించి మాట్లాడ్డా నికి నన్ను మీ దగ్గరకు పంపించారు. నన్ను రాఘవరావు అంటారు.

అధి:—అయితే యిప్పుడు నువ్వేమంటావ్?

రాఘవరావు:- నేను అనవలసింది—మీరు వినవల సిందీ చాలా వుంది. మేం యిప్పుడు మా సమావేశంలో తయారుచేసిన నివేదికను పేపరుకు పంపించే ముందు మీకు చదివి వినిపిస్తాను. (జేబులోనుంచి కాగితాలు తీస్తాడు.)

అధి:—నీవు వచ్చిన పనేమిటో టూకీగా రెండుమాట లలో చెప్పేయ్, మీ నివేదికలు, మీవిజ్ఞప్తులు వినడాని కిప్పుడు తీరికలేదు.

రాఘు:-మీరలా తేలికగా కొట్టిపారెయ్యడానికి వీలు లేదు. నేను యిక్కడకు నావ్యక్తిగత హోదాలో రాలేదు. నూట నలభైమంది నిరుద్యోగులకు ప్రతినిధిగా వచ్చాను. మావిజ్ఞప్తిని వినడానికి నిరాకరించే హక్కు గవర్నర్ జన రల్‌కు కూడా లేదు.—యీ నివేదికను క్లుప్తంగా తయారు చేశాం. చదువుతాను దయచేసి వినండి. (కాగితం చూసి చదువుతూ వుంటాడు.) ఆగస్టు 15 వ తేదీన భారత స్వాతం త్ర్య దినోత్సవ సమయంలో మేం నూట నలభై మంది నిరు ద్యోగులం తయారు చేసిన నివేదిక.

అధి:- అది పూర్తిగా అనవసరం

రాఘు:— మీరు మా నివేదికను పూర్తిగా విన్నతర వాత, మీకు తోచిన సవరణలు ప్రతిపాదించవచ్చు. (తిరిగి చదవటానికి ఉపక్రమిస్తాడు.) కోట్లకొద్దీ నిరుద్యోగులను ఉత్పత్తిచేసే విద్యాశాఖను ప్రథమంగా సంస్మరించుకొంటు న్నాం.

అధి:—ఏమయ్యోయ్ రాఘవరావు! ఆ సెంటెన్సు పూర్తిగా కొట్టెయ్యాలి. లేకపోతే నేను ఒప్పుకోను.

రాఘు:- నేను చదివింది పూర్తిగా విన్న తరవాత మంచి చెడ్డలు చర్చించుకుందాం. (చదువుతూ) యీ దేశంలో నిరుద్యోగ సమస్య రోజు రోజుకు భీకరరూపం దాలుస్తోంది. నిరుద్యోగ రాక్షసిబారికి గురియై రైళ్ళక్రింద, ట్రాములక్రింద, కాలువలక్రింద పడి ఆత్మహత్య చేసుకొన్న సోదర నిరుద్యోగ అమరవీరులకు మేం జోహారులర్పిస్తూ వారి కుటుంబాలకు సానుభూతి తెలియజేస్తున్నాం.— మేం లక్షలకొద్దీ సొమ్ము వ్యయపరచి చదువుకున్నందుకు ప్రతిఫలంగా నేడు అరకప్పు కాఫీకికూడా దిక్కులేక రోడ్లమీద అలమటిస్తున్నాం. జీవితావసరాలను తీర్చే ఏ ఉద్యోగం చెయ్యడానికైనా సరే మేం తయారుగావున్నాం. మేం మా ఉద్యోగాలకోసం దేశదిమ్మరులమై పోయాం.

అధి:—(కోపంతో) ఆ మహాభారతమంతా నాదగ్గర యెందుకు? పోయి ఏమంత్రిగారి దగ్గరో మొర పెట్టుకోండి. నాకు ఆఫీసుకు టైమై పోయింది. యిక వెళ్ళిపో!

రాఘు:—(ఉత్సాహంతో) యింత రసవత్తరమైన నివేదిక వినటానికి బాధపడతారేం సార్? మరో రెండు పేజీలు మాత్రమే వుంది. చదివేస్తాను.

అధి:—(ఓర్పును కోల్పోతూ) లాభంలేదు. యిక నేను వినను. నువ్వుముందు బయటికిపో, వెళ్ళకపోతే బంట్రోతుతో బయటకు గెంటిస్తాను. (ఎడమవైపు చూసి గట్టిగా) ప్యూన్! ప్యూన్! (గోపాలం టోపీ సవరించు కుంటూ తొందరగా వస్తాడు. వెనుక ఇందిర వస్తుంది.)

గోపా:— ఎందుకు సార్!

అధి:—(రాఘవరావును చూపిస్తూ) యితన్ని బయ యకు పంపించు.

(గోపాలం రాఘవరావును సమీపిస్తాడు. యిద్దరూ ఆశ్చర్యంతో ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు.)

రాఘు:—(ఆశ్చర్యంతో) యిదేమిటిరా గోపాల్! ఇంటర్ చదివి బంట్రోతు ఉద్యోగం చేస్తున్నావా?

గోపా:—(తేరుకొని ఖంగారుగా) పో! పోవయ్యా! నువ్వెవరివో నాకు తెలియదు. ముందు బయటకు వెళ్ళిపో! దొరగారికి కోపం వస్తే మంచోరుకాదు. ("పోరా బాబూ" అని బ్రతిమాలు తున్నట్లు సైగ చేస్తాడు.)

రాఘు:— (ఇదేం గమనించక మామూలుధోరణిలో) ఎంతకాలానికి చూశానురా గోపాల్ నిన్ను? యీ దౌర్భాగ్యపు ఉద్యోగం కోసం కొన్ని వందల మైళ్ళుదాటి యిక్క-

డకు వచ్చావుటా?

అధి:—(ఆశ్చర్యంతో) ఏమిటీ? గోపాలం ఇంటర్ చదివేడా? ధర్డుఫారం చదివేనని నాతో చెప్పాడు!

ఇం:—(ఆశ్చర్యంతో) ఏం గోపాల్? ఎందుకలా చెప్పేవ్?

రాఘు:—గోపాల్ నేను ఒకే కాలేజీలో చదువుకున్నాం. రోజులు బాగా వుండక విడిపోయాం. (జేబులోంచి ఒక కాగితం తీసి గోపాలానికి యిస్తూ) యిదిగో నా ఎడ్రస్! ఎప్పుడైనా వస్తూవుండు. (వెళ్ళబోతాడు.)

అధి:—(కోపంతో) ఎప్పుడో రావడం ఎందుకు? యిప్పుడే వస్తాడు. నీతో తీసుకు పో! (గోపాలంతో) నువ్వు నన్ను మోసం చేస్తావా? నిన్ను నమ్మి నేను—మామూలు బంట్రోతువేకదా—అని నా యింట్లో కూడా పెట్టుకున్నాను. నువ్వు చేసిన మోసానికి నిన్ను జైలుకు పంపించవచ్చు, అయినా క్షమించి నీకు ఉద్యోగం మాత్రమే తీసేస్తున్నాను. తక్షణం యిక్కడినుంచి పో!

గోపా:— (బతిమాలుతూ) పొరబాటయిండి. కొంచెం దయ చూపించాలి సార్.

ఇం:— యీసారికి వూరుకోనాన్నా! గోపాల్ చాలా మంచివాడు.

అధి:—(కోపంతో) మంచివాడట! మంచివాడు'. నువ్వు ముందు లోపలికి పో! (గోపాలంతో) మొద్దులా కదలవేం

ముందు యిక్కడినుంచి పో!

రాఘు:—రారా గోపాలం? నీలాంటి–ఒక విద్యచేతిలో వున్నవాడుకూడా—యిటువంటి పాడు ఉద్యోగం కోసం పాకులాడడం మంచిదికాదు. రా పోదాం.

గోపా:—కాలం కలిసి రానప్పుడు మనం యేం చెయ్యగలం? (అధికారితో) పోయివస్తాను సార్. సెలవు (రాఘవరావుతో) పదరా పోదాం.

రాఘు:—జంటగా వెడుతున్నాం. యిదీ ఒకందుకు మంచిదే.

(యిద్దరూ నిష్క్రమిస్తూవుంటారు. ఇందిర కళ్ళలో నీళ్ళు తిరుగుతాయ్.)

ఇం:-(విచారంతో) నాన్నా!

అధి:-(కోపంతో) నోర్ముయ్! లోనికిపో!

(విషాదవదనంతో ఇందిర ఎడమవైపు వెడుతూ వుంటుంది. అధికారి నిప్పులు కక్కుతూ చూస్తువుంటాడు.

(తెర)

## 2

(స్థలం:- పెద్దగది—సమయం: రాత్రి 7 గంటలు, గదినిండా న్యూస్ పేపర్లు, కాగితాలకట్టలు చిందరవందరగా పడివున్నాయి. ఒక ప్రక్క హార్మోనియంవుంది. మరోవైపు మూడు సూటి కేసులు, బెడ్డింగులు వున్నై. కొన్ని రంగు డబ్బాలు, బ్రష్‌లూ బల్లమీద ఉన్నాయి. రెండు ఎలక్ట్రిక్

దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నై. రాఘవరావు, శాస్త్రి చాపమీద కూర్చుని చెరో దినపత్రిక చదువుతూ వుంటారు.)

రాఘవరావు:-(పేపరు చదువుతూ) కావలెను, కావలెను క్రింది తరగతి గుమాస్తాలు కావలెను.

శాస్త్రి:—(తొందరగా తన చేతిలో పేపరు క్రింద పారేసి) యిక నేం! మూడుఖిల్లీ కేషనులు మైపుచేసి పారేద్దాం.

రాఘు:—చదివేది పూర్తిగా వినరా సోదరా! (తిరిగి చదువుతూ) కనీసపు విద్యార్హతలు మెట్రిక్యులేషన్. మొదల్గా కొని పైనరకు.

శాస్త్రి:-(ఉత్సాహంతో) చాలా బాగుంది.

రాఘు:—(చదువుతూ) ధరఖాస్తుదారులు తమ ధరఖాస్తుతోపాటు పది రూపాయలు చలానాకట్టి రసీదు జతచేసి పంపవలెను. మరియు ...

శాస్త్రి:-(కోపంతో) నోర్మూయ్. యిక చదవకు పది రూపాయిలుంటే యీ ప్రశాంత నిశాసమయంలో ఈగది లోపడి యిలావుండడం యేం ఖర్మం!

రాఘు:—ఒరేయి శాస్త్రీ! నువ్వింకా పాతకాలంలో వున్నావురా. పూర్వంలా యిప్పుడు ఉద్యోగాలకు ధరఖాస్తు ఒకటి పెడితే లాభంలేదు. దానితోపాటు ముడుపు కూడా చెల్లించాలి. యీ విధంగా మనలాంటి నిరుద్యోగులచేత బలవంతంగా సంపత్తిదానం చేయిస్తున్నారు.

శాస్త్రి:— మనకు సంపత్తిఅంటూ ఒకటి అఘోరిస్తే

కదూ, దానం చెయ్యడానికి.

రాఘు:—భావకవిత్వంతో భావనాలోకంలో విహ రించే ఓ కవి కుమారా! నీకు ప్రపంచజ్ఞానం శూన్యంరా! డబ్బున్న వాడెప్పుడూ దానం చెయ్యడు—అసలు సంపత్తి దానం గురించి ఒక ఐడియా కలిగేందుకు నీకు ఒక చిన్న ఉపన్యాసం యివ్వడం అవసరం.

శాస్త్రి:— కాఫీ చుక్కలు లేక నోరు ఎండిపోతూ వుంటే నీఉపన్యాసం వినడానికి ఓపిక ఎక్కడినుంచి వస్తుం దిరా నాయనా?

రాఘు:—ఒక గంట పోతే కాఫీ దానంతటఅదే దొరు కుతుంది. కాని నాలో యీ ఆవేశం పోతే నాకు యింతటి అమూల్యమైన ఉపన్యాసం యిక దొరకదు—జాగ్రత్తగా విను అసలు సంపత్తి దానం అనేది మన దేశంలో చాలాకాలం నుంచి వున్నది. దానినే "ఇన్‌కమ్ టాక్సు" అని పిలుస్తు వచ్చారు. యీ 'ఇన్‌కంటాక్సు' అనేది పెద్ద పెద్ద వ్యాపా రులు యిచ్చుకోవలసివస్తున్నది. కానివాళ్ళు దొంగలెక్కలు సృష్టించి యీ పవిత్రమైన సంపత్తిదానాన్ని ఎగగొడుతూ వచ్చారు. దానితో కొందరు మహానుభావులు తమ సర్వ స్వాన్నీ విసర్జించి ప్రజల హృదయాలలో పరివర్తన తీసుకు రావడం కోసం—సంపత్తిదానం గురించి ప్రచారంచెయ్యడం కోసం దేశపర్యటన ప్రారంభించారు. యీ పరిస్థితులలో...

శాస్త్రి:— (తల రెండు చేతులతో పట్టుకొని, అబ్బా!

తలనొప్పి! కట్టిపెట్టు యిక నీ ఉపన్యాసం.

రాఘు:—(నిరుత్సాహంతో) యింత అమోఘమైన ఉపన్యాసం విన్నా నీకు తలనొప్పి వచ్చిందంటే నీశరీరనిర్మాణంలో ఏదో పెద్ద లోపంవుండి వుండాలి! అందుచేత నిన్ను డాక్టర్ల దగ్గరకు పరిశోధనకు పంపించాలి.

శాస్త్రి:—రాజకీయాలు నాశరీర తత్వానికి పడవురా సోదరా!

రాఘు:—(కోపంతో) నీలాంటి దౌర్భాగ్యులవల్లే దేశం తగులబడి పోతోంది. బజారులో చింతపండుధర అణా పెరిగిందంటే అది రాజకీయసంఘటన, వీశపంచదార ధర మూడణాలు పెరిగిందంటే అది రాజకీయం. ఆఫీసులో గుమస్తాకు యింటిఅద్దె అలవెన్సు కోసేసారంటే అది రాజకీయం. కాఫీ ధర...

శాస్త్రి:—(ఒక్కసారిగా కోపంతో లేచినుంచుని తీక్షణంగా) ఒరేయి రాఘువరావు! నీమర్యాద నువ్వు కాపాడుకోవలసిన అవసరం ఎంతైనావుంది.

(గట్టిగా తలుపుకొట్టిన చప్పుడు వినిపిస్తుంది. శాస్త్రి కుడివైపు వెళ్ళివస్తాడు.)

శాస్త్రి:—నీజేబులో చిల్లరడబ్బులేమైనా వున్నాయా?

రాఘు:—చిల్లరడబ్బులు వుంటే నువ్వుచెప్పినట్లు యీ ప్రశాంతమైన వెన్నెల రాత్రిలో యీ గదిలో ఎందుకు గడుపుతాం?

శాస్త్రి:—పాలమనిషివచ్చేడు. డబ్బు యిచ్చేవరకూ కదలనంటున్నాడు.

రాఘు:—ఒరేయి శాస్త్రీ! నీకు లౌకికజ్ఞానం లేదురా! వాడికేదో సర్ది చెప్పి — యివేళటి పాలుకూడా తీసుకుని, పంపించాలి కాని, కళ్ళు తేలవేస్తే ఏంప్రయోజనంరా! నేను వెళ్ళి వాడిసంగతి కనుక్కొని వస్తానుండు.)

(కుడివైపు వెడతాడు. శాస్త్రి హార్మోనియంతీసి శ్రుతి వేస్తూవుంటాడు. రాఘవరావు చెంబుతో పాలు తీసుకుని తిరిగివస్తాడు.)

శాస్త్రి:—భలేవాడివిరా! మొత్తానికి సాధించేవు.

రాఘు:—సోమవారంవచ్చాక డబ్బిస్తాను. మరో గంట పోయాక రమ్మన్నాను. దానితో వాడు కొంచెంఆలోచించి పాలుయిచ్చి మరీవెళ్ళాడు. (చెంబు క్రింద పెడతాడు.)

శాస్త్రి:—సోమవారం మధ్యాహ్నం అనగా పోయాడు. యింతవరకూ రాలేదు. ఏంచేస్తున్నాడో పాపం! నీ ధర్మమా అని వాడి ఉద్యోగంకాస్తా వూడగొట్టావ్. యీ నెలరోజుల నుంచీ వాడుపడుతున్న పాట్లు యిన్నీఅన్నీ కావు.

రాఘు:—వస్తాడురా వస్తాడు. తెస్తాడురా తెస్తాడు. ఏదో ఉద్యోగం పట్టుకువస్తాడు. ఏదీ హుషారుకోసం చిన్న రాగం తియ్యి. (శాస్త్రి హార్మోనియం వాయిస్తూ పాట పాడడానికి ఉపక్రమిస్తాడు. రాఘవరావు కుండఒకటి తీసుకువచ్చి ఘట వాయిద్యం ప్రారంభిస్తాడు)

శాస్త్రి:—(పాట)

గోపాలు డేడిరా? — కనుపించ డేమిరా?
ఏవీధి కెళ్ళాడో — ఏపని బున్నను పట్టాడో
వాడికైన నీకైన — ఏదైనా పని దొరికిన
కష్టాలుతీరుతాయి-మన— నష్టాలు పూడుతాయి
గోపాలు డేడిరా? — కనుపించ డేమిరా?

(రాఘవరావుకూడా అందుకొని చివరిచరణంపాడుతూ ఉంటాడు. వాడిపోయిన ముఖంతో ఎడమనైపునుంచి గోపాలంవస్తాడు. గోపాలాన్నిచూడగానే యిద్దరూ పాట ఆపుచేసి ఆతృంతో లేచి నుంచుంటారు.)

గో:—(చిరునవ్వుతో) నేను సజీవుడినై వుండగానే నామీద పాటలు పాడుతున్నారన్నమాట!

రాఘు:—నువ్వెళ్ళిన పని ఏమయిందిరా?

శాస్త్రి:—ఏమైనా దొరికిందా?

గోపా:—లేదు! దేశం గొడ్డుపోయింది.

శాస్త్రి:—ఆమాట నీముఖమే చెబుతూందిలే.

గోపా:—(నిస్పృహతో) లేవు. ఎక్కడా ఖాళీలులేవు. యిక మనభవిష్యత్తు అంధకారమయం.

రాఘు:—నిరుత్సాహపడకురా సోదరా! యీప్రపంచంలో మానవుణ్ణి పురోగమింపజేసేది ఉత్సాహం ఒక్కటే! అదికూడా కోల్పోతే జీవితం శూన్యం. నిరుత్సాహంమనల్ని కైలుపట్టాలమీదికి తోలుతుంది,

శాస్త్రి:—చావలేక బ్రతుకుతున్న మనుషుల జాబితా తయారుచేస్తే అందులో మన పేర్లు ప్రథమ శ్రేణిలో వుంటాయి.

గోపా:—(దైన్యంతో) యీ నిరుద్యోగ సమస్య మన జీవితకాలంలో పరిష్కారం అవుతుందో లేదో?

రాఘు:—నేను యీమధ్య యీ నిరుద్యోగ సమస్య గురించి ఒక విదేశీ నిపుణుడితో మాట్లాడం తటస్థించింది,

శాస్త్రి:—(ఆశ్చర్యంతో)నీకు విదేశీ నిపుణు డెక్కడ దొరికాడు? వాడు ఏదేశపువాడు?

రాఘు:—(నవ్వి) ఆమాత్రం అర్థం చేసుకో లేవటోయి! విదేశీ నిపుణుడంటే యే విదేశాలనుంచో దిగిరానక్కరలేదు మనదేశంలోనే వుంటూ మనదేశపు విషయాలలో శ్రద్ధ చూపించకుండా ఎప్పుడూ విదేశీవ్యవహారాల గురించి పరిశోధనలు జరిపేవాణ్ణి విదేశీ నిపుణుడంటారు.

శాస్త్రి:—అయితే అతగాడేమంటాడు?

రాఘు:—చతుర్థ పంచవర్ష ప్రణాళికనాటికిమన దేశంలో ఒక్కనిరుద్యోగికూడా వుండడని చెప్పేడు.

గోపా:—యింతటితో యీబోడిచర్చముగించి కొంచెం కాఫీవుంటేయివ్వండి. నిలువలేనంత నీరసంగావుంది. (చాప మీదకూర్చుంటాడు)

రాఘు:—(శాస్త్రితో) ఓభావకవీ! బాహ్యప్రపంచం లోకి వచ్చి స్టౌవెలిగించు, మూడుగ్లాసులకుతక్కువకాకుండా

కాఫీ తయారుచేసి తీసుకురా!

శాస్త్రి:—ఇవేళ కాఫీ తయారుచేసే వంతు నాది కాదు సీది. నువ్వేవెళ్ళిచెయ్యి.

రాఘు:—నేను గోపాలంతో మన భవిష్యత్తు గురించి నిర్మాణాత్మకమైన చర్చలు సాగించదలుచుకున్నాను. కనుక యివేళకూడా నువ్వేతయారుచెయ్యి,

శాస్త్రి:-(కోపంతో)నువ్వు దేనిలో చెయ్యిపెడితే అది సర్వనాశనం. చర్చలు సాగిస్తాడట! చర్చలు! (పాలచెంబు, తీసుకుని కుడివైపు నిష్క్రమిస్తాడు)

రాఘు:—ఉద్యోగం దొరకకపోతే పోనియ్యి! నీ సంగీతపు పాఠంతాలాకు జీతమైనా అందినదా?

గోపా:-ఇరవై రూపాయలు మాత్రం అందినై. అవి దారిలో హోటలువాళ్ళకు యిచ్చివచ్చాను.

రాఘు:-యిప్పుడే ఎందుకు యిచ్చేశావు? తర్వాతిచ్చేవాళ్ళంగా?

గోపా:—ఎక్కడచూచినా బాకీలు! ఎటు చూచినా అప్పులవాళ్ళు? యీబాధ ఎంతకాలం భరించడం? కనీసం ఒకళ్ళైనా వదిలించుకుంటే చాలునని హోటలుకు డబ్బు కట్టేశాను.

రాఘు:-తరచి చూసేకొద్దీ పరిస్థితులు చిత్రంగా కనిపిస్తున్నాయి. ఎక్కడా ఉద్యోగాలులేవు. ఎటు చూచినా వేలావి నిరుద్యోగులు. కేవలం ఉన్నత విద్యలోనే శాస్త

యితరకళలలో ప్రవేశంవున్న మనంకూడా యీసమాజంలో పసువుగా బ్రతకలేకపోతున్నాం.

గోపా:-అయినా మనసోదరనిరుద్యోగులకంటే మనం అనేకరెట్లు నయం. నాకు సంగీతప్రసారాలవల్ల నెలకోనలభై రూపాయిలుదొరుకుతున్నై. కథలు, విమర్శలు పత్రికలకు వ్రాస్తున్నందుకు కనీసం నెలకు పదిరూపాయలైనా శాస్త్రీకి దొరుకుతున్నాయి. నువ్వుషాపులవాళ్ళకు బోర్డులురాసినెలకు ఓయిరవై రూపాయలైనా సంపాదిస్తున్నావ్.

రాఘు:-(విచారంతో) నాభావాలను రంగులతోతీర్చి దిద్దాలని చక్కనిచిత్రాలను చిత్రించాలనిచిత్రలేఖనంనేర్చు కున్నాను. చివరకు నాఆశయాలు తీరని కోరికలుగా మారి పూరుకున్నై. పవిత్రమైనకళను వ్యాపారానికి ప్రచార సాధ నంగా ఉపయోగించవలసివచ్చింది.

గోపా:-నిత్యదరిద్రంతో బాధపడే ప్రజలకు సంగీత సాహిత్య చిత్రలేఖనాలను ఆదరించే శక్తి ఎక్కడి నుంచి వస్తుంది? రోజంతా తిండిలేక బాధపడుతున్నమనిషికిసంగీతం వినిపిస్తే ఏంజరుగుతుంది?

రాఘు:-ఏమైనా జరగవచ్చు

(ఎడమవైపు నుంచి ఇందిర వస్తుంది. జుత్తు రేగివుంది, ముఖంలో తొందర కనిపిస్తుంది.)

ఇం:-గోపాల్ !

గోపా:-(ఆశ్చర్యంతో లేచి) ఏం అమ్మాయిగారు!

యిలా వచ్చారెందుకు?

ఇం:—తెలుసుకోలేనేమో అనుకున్నాను. కాని చివరకు నువ్వుండేచోటు తెలుసుకున్నాను.

గోపా:—అంత అవసరం ఏల వచ్చిందిఅమ్మాయిగారూ

ఇం:—ఏంగోపాల్! అమ్మాయిగారు కొమ్మాయిగారు అంటే నేను వూరుకోను. తెలిసిందా?

(కుడివైపు నుంచి శాస్త్రి తొందరగా వస్తాడు. రాఘవరావు శాస్త్రి ఆశ్చర్యంతో ఇందిరనూ, గోపాలాన్నీ చూస్తూవుంటారు)

గోపా:—సరే! మీరు వచ్చిన పనేమిటో దయచేసి చెప్పండి.

ఇం:—(నిరాశతో) నువ్వు యిటువంటి ప్రశ్న వేస్తావనుకోలేదు గోపాల్! నన్ను చూడగానే సంతోషంతో ఆహ్వానించి కూర్చోమంటావనుకున్నాను.

గోపా:—పై అంతస్థులో నివసించే మిమ్మల్ని క్రింది అంతస్థులోవుండే నేను ఎలాగౌరవించాలో నాకు తెలియదు.

ఇం:—అందుకోసం గౌరవించడం మానేశావు!

గోపా:— యింతకూ యీరాత్రివేళ యిలా మీరెందుకు వచ్చారో...(సందేహిస్తాడు)

ఇం -గోపాలం! నువ్వారమారమి ఒక సంవత్సరం మా యింట్లోవున్నావు. చివరిరోజువరకూ నిన్ను నేను గుర్తించలేకపోయాను. నీమీదకలిగిన అభిమానాన్ని పైకి తెలియ

జెయ్యలేక నీతో ఎప్పుడూ పేచీ పడుతూవుండేదాన్ని. నువ్వె ళ్ళినదగ్గరనుంచీ నిన్ను చూడాలని నాకెందుకో కుతూహ లంగా వుంది.

గోపా:—అదిసహజమే దానిలో విశేషం ఏమీ లేదు. పెంపుడుకుక్క నాలుగురోజులు కనిపించకపోతే యజమాని మనస్సంతా దానిమీదే వుంటుంది. యిదీఅటువంటి మమ కారమే కావచ్చు.

ఇం:—నీతోకొన్ని ముఖ్యమైనవిషయాలు మాట్లాడాలి (రాఘవరావును శాస్త్రిని చూసి) వీరినికొంచెం... (వాక్యం పూర్తిచెయ్యడానికి సంశయిస్తుంది. శాస్త్రి. రాఘవరావు ఒకరికేసి ఒకరు చిరునవ్వుతో చూసుకొని కుడివైపు వెళ్ళి పోతారు.)

గోపా:—(ఆమెముఖంలోకి తీక్షణంగాచూస్తూ) యీ సమయంలో మీరుయిలా రావడం ఏమీ బాగాలేదు.

ఇం:—నేను నీకేం అపకారం చెయ్యడానికి రాలేదు గోపాల్!

గోపా:—నాబ్రతుకేదో విధంగానేను బ్రతుకుతాను. మీరు నాకేంఉపకారం చెయ్యనక్కరలేదు. మీరు దయ చేసి వెళ్ళిపొండి. యిప్పుడు మీ వాళ్ళెవరైనా మిమ్మల్ని యిక్కడచూస్తే, మా ఉన్న బ్రతుకుకు కూడా ముప్పు రావచ్చు.

ఇం:—(కోపంతో) యింటికివచ్చినవాళ్ళను మర్యాద

చేసేవిధం యిదా గోపాల్? నన్ను కూర్చోమన లేదుసరికదా! పైగా తక్షణం వెళ్లిపొమ్మంటున్నావ్! (ధృఢనిశ్చయంతో) ఏమైనాసరే! నేను యిక్కడే కూర్చుని, యిక్కడినుంచి కదలను.

(సూట్ కేసుమీద కూర్చుంటుంది.)

గోపా:-(విధిలేక) మీరేమీ అనుకోవద్దు. రోజంతా తిరిగి అలసిపోయి చిరాకుతో మిమ్మల్నలాగన్నాను. మీరు చెప్పదలచినదేదో వేగం చెప్పండి. (నిస్పృహతో) కాలం కలిసిరానప్పుడు కాళ్లయినా పట్టుకోవాలి.

ఇం:—ఉద్యోగం చెయ్యక్కరలేకుండాజీవితంసుఖంగా గడిచేఉపాయం చెబుతానని, యిదివరకు నీతో ఒకసారి అన్నాను జ్ఞాపకం వుందా?

గోపా:-అదేమిటో మాత్రం మీరు చెప్పలేదు.

ఇం:—అదిచెప్పడానికే నేనిప్పుడు వచ్చాను. నువ్వేం కష్టపడనక్కర్లేదు. శ్రమపడి పనిచెయ్యక్కర్లేదు.

(ఎడమవైపునుంచి 'రాఘవ రావు' 'రాఘవ రావు' అని కేకలువేస్తూ సుబ్బారాయుడు ప్రవేశిస్తాడు. వయస్సు 40 సంవత్సరాలు. నల్లకోటు, గ్లాస్కోపంచె, వేళ్లకు వుంగరాలు. బాగా డబ్బున్నవాడిలా కనిపిస్తాడు)

సుబ్బారాయుడు:-(గోపాలంతో) ఏడయ్యా రాఘవ రావు? యిల్లు అద్దెకిచ్చేవరకూ మాయింటిచుట్టూ తిరిగాడు. యిప్పుడునేను అతనికోసం తిరగవలసివస్తోంది.

గోపా:—లోపలవున్నాడండి. నాల్గురోజులలోమీ అద్దె యిచ్చేస్తాం. మీరేం తొందరపడకండి.

సుబ్బా:—యిలా టివాయిదాలెన్ని అయినాయయ్యా! కొంచెం మంచీమర్యాద వుండనక్కర్లేదూ? రెండు నెలల అద్దె బకాయి పడిందంటే మాటలా?

ఇం:—(సుబ్బారాయుడుతో) వీరు మీకు అద్దె ఎంత యివ్వాలండి?

గోపా:—(తొందరగా) దయచేసి చెప్పకండి. ఆడబ్బేదో రెండురోజులలో మేమే యిచ్చుకుంటాం (కుడివైపుచూస్తూ ఒరేయి రాఘవరావూ బయటకు తగలడరా బాబూ!

సుబ్బా:—(ఇందిరనుపరికించిచూచి) ఓహో! మీరా— అమ్మాయిగారూ! యిక్కడున్నారేం?

గోపా:—(ఇందిరను జవాబుచెప్పనీకుండా తనే కలగ జేసుకొని) ఆఁ! యేమీ లేదులెండి. సంగీతం పాఠం నేర్చుకో డానికి వచ్చారు.

ఇం:—(సుబ్బారాయుడిమీదికివచ్చి) నేను యిక్కడకు ఎందుకువస్తే మీకెందుకు? అది అంతా అధిక ప్రసంగం. (కోపంతో చూస్తుంది.)

సుబ్బా:—ఇదేమిటంషోయి ఇందిరమ్మగారు! మీరు కూడా మా యింటిలోనే వుంటున్నారు గనుక కుశలప్రశ్న వేశాను. యిందులో తప్పేముంది?

ఇం:—(కోపంతో) మీయింట్లో అద్దెయిచ్చి వుంటు

న్నామా? వట్టినే వుంటున్నామా?

సుబ్బా:—అమ్మమ్మ! ఎంతమాటఅన్నారు!

ఇం:—(కోపంతో) అటువంటప్పుడు మీ యిష్టంవచ్చి నట్లు ప్రశ్నలు వేయడానికి మీకే హక్కువుంది?

గోపా:—(ఇందిరతో బ్రతిమాలుతున్న ధోరణిలో) అమ్మాయిగారూ! మీరు కొంచెం దయచేసి వూరుకోండి. (సుబ్బారాయుడుతో) మీరేంఅనుకోకండి సుబ్బారాయుడు గారు! అమ్మాయిగారికి ఉత్తుత్తనే కోపంవస్తూవుంటుంది.

సుబ్బా:—కుశల పశ్న వేసినంతమాత్రానికే కోపం వస్తే ఎలాగండి? రేపు వెళ్ళి, వాళ్ళ నాన్నగారితో చెబు తాను.

ఇం:—(మరింత కోపంతో) ఏమిటి మహాబెదిరిస్తు న్నారు! రేపు కాకపోతే యిప్పుడే వెళ్ళి చెప్పండి మా నాన్నతో! నాకేంభయం అనుకున్నారా?

గోపా:—(బ్రతిమాలే ధోరణిలో) సుబ్బారాయుడు గారూ! మీరు వాళ్ల నాన్నగారితోమాత్రం చెప్పకండి. మీకు పుణ్యం వుంటుంది. యీ చిన్న విషయానికి పెద్ద వాళ్లవరకూ ఎందుకు వెళ్లాలి?

సుబ్బా:—(గోపాలంకేసి, ఇందిరకేసి అనుమానంగా చూస్తు) లోకంమరీ చెడిపోతుంది.

ఇం:—యింతకూ వీరు మీకు యివ్వవలసిన అద్దెఎంతో చెప్పరేం?

గోపా:—(తొందరగా) ఒరేయి రాఘవరావ్వూ! బయటకు రారాబాబూ! (ముందు రాఘవరావు వెనుక శాస్త్రి కుడివైపునుంచి దర్జాగా వస్తారు)

రాఘు:— (గది అంతా కలయజూచి నాటక ఫక్కీలో) దుర్యోధన మహారాజుకు మరియొక పరాభవమూ? (సుబ్బారాయుడికేసి తిరిగి) హల్లో! సుబ్బారాయుడుగారూ! యిదేనాతమరు రావడం?

సుబ్బా:—పారెయ్యవయ్యా! ఆ నలభై రూపాయలూ యిలా పారెయ్! నువ్వు పెట్టిన గడువుకు సరిగా వచ్చాను.

రాఘు:—యివేళ అందవలసిన సొమ్ము అందలేదండీ! రేపు సాయింత్రం నేనే తీసుకువచ్చి తమకు దఖలు పరుచుకుంటాను.

సుబ్బా:— యిక లాభంలేదు. ఒకపూటకూడా నేను గడువు యివ్వను. మిమ్మల్ని బయటకుగెంటి తలుపు తాళం వేస్తాను.

శాస్త్రి:—బయటకు పంపి తాళం వెయ్యడం ఎందుకు? మమ్మల్ని లోపలపెట్టే తాళం వెయ్యండి. యీ రాత్రియినా సుఖంగా నిద్రపోతాం.

రాఘు:—మా మంచిమాట చెప్పేవురా కవికుమారా! (ఇందిరతో) అమ్మాయిగారూ! యికమీరు దయచేసి వెళ్ళిపొండి. యీ రాత్రికి వీరు మమ్మల్ని యీ గదిలో వుంచి భద్రంగా తాళం వేసుకుంటారు.

సుబ్బా:—(కోపంతో) యిదేం డబ్బుతో వ్యవహారం అనుకున్నారా? వేళాకోళం అనుకున్నారా? — మీరంతా తక్షణం గదిలోంచి బయటకు వెళ్ళకపోతే మర్యాదదక్కదు.

ఇం:—(కోపంతో సుబ్బారాయుడి మీదికి వచ్చి) మర్యాద దక్కకపోవడానికి ఏం చేస్తావయ్యా నువ్వు? నలభై రూపాయలకోసం వూరూవాడ గోల చేస్తున్నావ్? నలభై రూపాయలంటే నా ఒక పుస్తకం ఖరీదు కూడా లేదు. యిప్పుడే మీడబ్బు మీకిచ్చేస్తాను. (గోపాలంతో) డబ్బు తీసుకొని అరగంటలో వస్తాను గోపాల్! (వెళ్లబోతుంది)

గోపా:-(తొందరగా) అమ్మాయిగారూ! (ఆగుతుంది) మీరేం తీసుకురావద్దు. రేపు మేం ఏదో విధంగా సర్ది యిచ్చేస్తాం.

ఇం:—(కోపంతో) అదేం వీల్లేదు. నేను తీసుకువచ్చి యిస్తా నన్నప్పుడు తీసుకువచ్చి యిస్తాను. మాట తప్పడా నికి వీల్లేదు. (సుబ్బారాయుడు కేసి కోపంగా చూస్తూ) నలభై రూపాయలకోసం యిష్టం వచ్చినట్లు మాట్లాడుతు న్నాడు! (ఎడమవైపు నిష్క్రమిస్తుంది.)

రాఘు:—యికనేం! రేపు ఉదయం రండి సుబ్బారా యుడుగారూ! మీ సొమ్ము మీకు అందుతుంది.

సుబ్బా:— సరే! యీ వాయిదా కూడా చూస్తాను. పోతూవుంటాడు)

గోపా:—సుబ్బారాయుడుగారూ! (ఆగుతాడు) ఏమీ

అనుకోకండి. ఆ అమ్మాయి స్వభావం అంత!

సుబ్బా:—నాలాంటి ఒక పెద్ద మనిషితో నోటికివచ్చినట్లు మాట్లాడితే వూరుకుంటారటండీ? రేపు వాళ్ళనాన్నతో మాట్లాడతాను.

(ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

రాఘు:—ఒరేయిగోపాల్! భలే శిష్యురాలిని సంపాదించావురా, పిల్ల అంటే అలా వుండాలి. సుబ్బారాయుడు అంత మనిషిని దులివి వదిలి పెట్టింది.

గోపా:-(దీర్ఘాలోచనలో) చూశాడు సుబ్బారాయుడు చెప్పేస్తాడు వాళ్ల నాన్నతో, యీ ఉపద్రవం నుంచి తప్పుకోవడం ఎలాగో?

శాస్త్రి:— ఒరేయి రాఘువరావు! ఇందిర వరస చూస్తూవుంటే మన గోపాలాన్ని గాఢంగా ప్రేమించినట్లు తెలుస్తోంది.

రాఘు:—ఎలా చెప్పగలవ్?

శాస్త్రి:— గోపాలం వాళ్లయింటి నుంచి వెళ్ళిపోయినప్పటినుంచీ ఇందిరకు గోపాలాన్ని చూడాలనే కోరిక ఎక్కువయ్యిందట. ఒక స్త్రీకి ఒక పురుషుణ్ణి కాని, ఒక పురుషునికి ఒక స్త్రీని కాని చూడాలని కలిగే కోరికకు "ప్రేమ" అని నామకరణం చేశాడు. ఫ్రాయిడ్.

రాఘు:—గోపాలంవంటి నెమ్మదైన వాడికి అటువంటి అమ్మాయి భార్యగా దొరకకపోతే లాభం లేదు—ఎ..మైనా

శాస్త్రిల వాడు యింటికి వస్తే హడలెత్తించేస్తుంది.

గోపా:—(యింకా దీర్ఘాలోచనలోనే వున్నాడు.) ఆలోచించాలి! ఆలోచించాలి! అధికారికి తెలిస్తే కొంప మునుగుతుంది. యీ అపాయంనుంచి తప్పుకోవాలి!

శాస్త్రి:—అరకప్పు—కాఫీ తాగిన తరవాత అపాయం నుంచి తప్పుకునే ఉపాయం ఆలోచించు.

రాఘు:—లేరా సోదరా! కాఫీ తే! యీ జీవితమింతే!

(శాస్త్రి వెళ్ళి మూడు గ్లాసులతో కాఫీ తీసుకువస్తాడు. ముగ్గురూ కాఫీ తాగడానికి గ్లాసులు పైకెత్తే సమయంలో బయట తలుపు కొడుతున్న చప్పుడు వినిపిస్తుంది. భయంతో ముగ్గురూ గ్లాసులు కిందికి దించేస్తారు. శాస్త్రి ఎడమవైపు వెళ్ళివస్తాడు)

శాస్త్రి:—(తొందరగా) వేగం కాఫీ తాగండి. దీపాలు ఆరిపోతున్నై.

గోపా:—(ఆత్రంతో) ఏం? ఏం జరిగింది?

శాస్త్రి:—ఎలక్ట్రిక్ కరంటు బిల్లు కట్టమని మనిషి వచ్చాడు. రేపు యిస్తానన్నాను. గడువుదాటి పోయింది గనక కనెక్షన్ కత్తిరించేస్తానని బయలు దేరాడు.

రాఘు:—హా! ఘోరవార్త! యిది ఎంతటి దుర్దినంరా నాయనా!

(ముగ్గురూ తొందరగా కాఫీ తాగుతారు.)

శాస్త్రి:—(గట్టిగా) సోదరులారా! ఒక విఘడియలో

దీపాలు ఆరిపోతున్నవి. ఎవరిస్థానంలో వారు భద్రంగా వుండండి.

(ఆకస్మికంగా దీపాలు ఆరిపోయినై. గది అంతా అంధకారం అలముకొంది. వీధిలోని ఎలక్ట్రిక్ దీపాలు కాంతి కిటికీలోంచి వచ్చి గదిలో పడుతోంది. మనుష్యులు సరిగా కనిపించడంలేదు. మాటలు వినిపిస్తున్నై.)

రాఘు:—(హార్మోనియం వాయిస్తూ) సందర్భానికి సరిపోయే పాట ఒకటి పాడరా గోపాల్!

గోపా:—(పాట పాడడం ప్రారంభిస్తాడు)

అంధకార బంధుర మీ జగతి_అందదోయి యీ జగతికిప్రగతి
మాయలలోమమతలలో చిక్కి-మతి చలించి పరిభ్రమించనేలా
ఆగవోయి ఓ బాటసారీ! — అంధకార బంధుర మీ జగతి
వెలుగు రేఖలే విరియవులే!— వెతలు నిన్ను యిక విడువవులే!
ఆగవోయి ఓ బాటసారీ! — అంధకార బంధుర మీ జగతి!

(దబ దబా తలుపు చప్పుడు వినిపించడం, పాట ఆగడం ఒకసారి జరుగుతుంది.)

ఒక గొంతు:—(గట్టిగా) నాటకం ఆడుతున్నారటయ్యా ఒక గంట పోయాక పాలకు డబ్బిస్తాం అని చెప్పారా లేదా? తీరా వచ్చేసరికి దీపాలార్పుకుని కూర్చున్నారా?

రాఘు:—(వేదాంత ధోరణిలో) వెర్రి నాయనా! యీ ప్రపంచంలో ఏమనిషీ తన దీపం తాను కావాలని ఆర్పుకోడు. ఈమాయామేయ జగంలో సర్వం స్థిరమని భ్రమించి. ఒక

మనిషి మరొక మనిషి దీపం ఆర్పుతున్నాడు. అవకాశం చిక్కినప్పుడల్లా ఆర్పడానికి ప్రయత్నిస్తున్నాడు. అందుకే యీ ప్రపంచంలో అనుదినం యుద్ధాలకు అనుకూలవాతావరణం ఏర్పడుతోంది.

గోంకు;—ఏమండోయ్ అబ్బాయి గారూ! ఆసోదేమీ నాకు తెలవదు. రేపు పొద్దు పొడిచే సరికి వచ్చి కూకుంటాను. డబ్బిస్తే సరేసరి. యివ్వకపోతే మర్యాద దక్కదు.

శాస్త్రి:— పోయాడు. యీరాత్రి బాకీల కోసం రావలసిన వాళ్ళజాబితాలో నలుగురు వదలి పోయారు—మర్యాద దక్కదట! డబ్బు కలవాడికే మర్యాద! లేనివాడు బ్రతుకు అంధకార మయం! యీ అందకారం పారద్రోలడం కోసం తలొక జ్యోతీ వెలిగించాలి.

రాఘు!—ఒకేయి గోపాలం, కొవ్వొత్తులు ఎక్కడ వున్నాయిరా వెలిగిస్తాను.

గోపా!—కుడివైపు బల్లమీద వున్నాయి. జాగ్రత్త వెదుకు!

శాస్త్రి:—హార్మోనియం వాయించరా గోపాల్!

(పాట) వే వెలుంగుల దొరవేంచేయు దాక
వెలిగించరా జ్యోతి వెలిగించరా!

(గదిలో నాలుగు మూలలా నాలుగు కొవ్వొత్తులు దేదీప్యమానంగా వెలుగుతాయి. ముగ్గురూ స్పష్టంగా కనిపిస్తూ వుంటారు.)

గోపా:–(ఆకస్మికంగా) యీ చిక్కుల నుంచి మనం తాత్కాలికంగా తప్పుకోవడానికి నాకో చక్కని ఉపాయం తట్టింది.

రాఘు:–యిక కావలసిందేముంది! ఏం చెయ్యాలో వేగం చెప్పు!

గోపా:–ఎవడి మూట వాడు సర్దుకోండి.

శాస్త్రి:–(ఆశ్చర్యంతో) ఏం? ఎందుకు?

గోపా:–యీ వూళ్ళో వుంటే మనం పొందే లాభం ఏముంది? ఏ వూరైనా పోదాం. మనకు ఒక వూరేమిటి? ఎక్కడో పుట్టాం. జీవనోపాధికోసం యిక్కడకు వచ్చాం. యిక్కడి పరిస్థితులు అనుకూలంగా లేవు. మరో చోటికి పోతాం.

రాఘు:–నువ్వు చెప్పినదానిలో నిజం లేకపోలేదు. రేపు ఉదయమే పోదాం.

గోపా:–ఒక క్షణంకూడా యిక్కడ వుండడానికివీల్లేదు పదండి పోదాం. యిక మనం ఉద్యోగాలకోసం వెతుక్కుంటే లాభంలేదు. నేను హార్మోనియం చంకను పెట్టుకొని వీధివీధి తిరిగి డబ్బు సంపాదిస్తాను.

రాఘు:–నేను నా చిత్రలేఖన విద్యను ఒక మూలపెట్టి సూట్ కేసులకు, ట్రంకు పెట్టెలకు రంగులు వేస్తాను.

శాస్త్రి:–(నిస్పృహతో) అయితే ఎందుకూ పనికిరాని వాణ్ణి నేనేనా? ఏం చేస్తాను: ఏ మందుల కంపెనీలకైనా ప్రక

టకలు రాసిపెడతాను. (ముగ్గురూ బెడ్డింగులు సూట్ కేసులు పట్టుకుని ఒక అడుగు ముందుకు వేస్తారు.)

ఇం:-(నేపథ్యంలోంచి) గోపాల్! అంతా చీకటిగా వుందేం!

గోపా:-(సూటికేసు బెడ్డింగు క్రిందపెట్టి భయంతో) కొంప మునిగింది. అనుకున్నంతపనీ జరిగింది. వచ్చేసింది?

రాఘు:-వస్తే రానియ్యరా! యిప్పుడేమంత కొంప మునిగింది?

గోపా:-నీకు తెలియదురా బాబూ! నా సమస్యలతో నే నే కొట్టుకు చస్తుంటే యీ గొడవకూడా ఎలా భరించగలను? ఏదో విధంగా ఆమెను యిక్కడినుంచి పంపించు. నీకుపుణ్యాం వుంటుంది. నేను పోయి దాక్కుంటాను.

(కుడివైపువెళ్ళి పోతాడు. ఇందిర ఎడమవైపు నుంచి 'గోపాల్' 'గోపాల్' అని పిలుస్తూ వస్తుంది.)

ఇం:-(రాఘవ రావుతో) గోపాల్ ఏడి?

రాఘు:-(ఆశ్చర్యాన్నభినయిస్తూ) అదే! మీకు కని పించలేదూ? మీకోసం మీయింటికి యిప్పుడే వెడుతున్నాడు

ఇం:-(తీక్షణంగా) మన దగ్గర అలాంటి నాటకాలేం పనిచెయ్యవు. మీవరస చూస్తుంటే మీరు అతనిని ఎక్కడో దాచి నాటకం ఆడుతున్నట్లు కనిపిస్తున్నారు. అతను వచ్చే వరకూ నేను యిక్కడే కూర్చుంటాను. (సూట్ కేసుమీద కూర్చుంటుంది) (రాఘవరావు, శాస్త్రి నిస్పృహతో ఒకరి

కేసి ఒకళ్ళు చూసుకుంటారు.)

రాఘు:-(నచ్చచెప్తూ) మీదగ్గర నాటకం ఆడవలసిన అవసరం మాకేముంది అమ్మాయిగారూ? అలా చెయ్యడానికి మీకు మేం ఏమైనా బాకీ వున్నామా? పైగా మీరే మాకు డబ్బు యిస్తామంటున్నారు. అటువంటప్పుడు మిమ్మల్ని మేం ఎందుకు మోసం చేస్తాం? మీరు మీయింటికి వెళ్ళి చూడండి. అతను రాకపోతే మళ్ళీ రండి. మేం వూరువదిలి పెట్టి పోవడం లేదు కదా!

ఇం:-(లేచి) సరే! వెళ్ళి చూసి వస్తాను. యిదే—అబద్ధం అవ్వాలి, తిరిగివచ్చి మీపనిపడతాను. (ఎడమవైపు వెళ్ళిపోతుంది.)

గోపా:-(కుడివైపు నుంచి వచ్చి) గొప్ప ప్రమాదం నుంచి తప్పించావురా రాఘవరావు! యిక ఆలస్యం చెయ్యొద్దు. లేవండి.

శాస్త్రి:-(దైన్యంతో) యీ రోజుతో యీ వూరికీ మనకూ ఋణం తీరిపోయింది.

రాఘు:-యిది ఎన్నవ వూరురా సోదరా! మన రోజులు బాగుపడే వరకూ ప్రయోగమిద్దాం.

(ముగ్గురూ సూట్ కేసులు, బెడ్డింగులు తీసుకొని ఎడమవైపు నిష్క్రమిస్తూ వుంటారు— తెర)

"జ్యోతి" సెప్టెంబరు 55

——o——

# పృథ్వీపుత్రులు

## పాత్రలు.

మల్లయ్య
కామరాజు
వెంకయ్య
సీతారాం
గౌరీపతి

ఎల్లయ్య
సుబ్బయ్య
రత్నావతి
రాధ

# రంగము: 1

♦ స్థలం: కామరాజు యింటి ఆవరణ. ♦

సమయం: రాత్రి 11 గంటలు.

చెట్లు, రకరకాల పూలమొక్కలు గాలికి కదులుతూ వుంటాయి. మేడానున్నుంచి వచ్చే ఎలక్ట్రిక్ దీపపు కాంతి చెట్లమీద పడుతోంది. గాలికి కదిలే ఆకుల సవ్వడి తప్ప ప్రకృతినిశ్శబ్దంగా వుంది. మల్లయ్యా, ఎల్లయ్యా చెట్ల క్రీనీడ లోంచి అడుగుల సవ్వడి కాకుండా—వెనుకకూ ముందుకూ బెదురు చూపులు చూస్తూ—ప్రవేశిస్తారు. యిద్దరూ దృఢకాయులు. వయస్సు 40 సంవత్సరాలు. గుండ్రని పెద్ద ముఖాలు; బొద్దుమీసాలు; కండలు తిరిగినదండలు, కళ్ళలో కాంత్తు పడకుండా వుండేందుకు యిద్దరూ తలలకు నల్లటిగుడ్డలు కట్టుకున్నారు. ఆ సమయంలో వాళ్ళను ఎవరైనా చూస్తే యమదూత లనుకుంటారు.

మల్లయ్య:—ఇంకా యింట్లోవాళ్ళు నిద్రపోయినట్టు లేదురా ఎల్లయ్యా!

ఎల్లయ్య:ఒరేయి మల్లయ్యా! యీ కాలపు మనుషులు—అందులోనూ డబ్బున్నవాళ్ళున్నారుచూశావూ—వాళ్ళు రాత్రుళ్ళంతా పేకాట కబ్బులోను, సినిమాలోను

తిరిగి తిరిగి అర్ధరాత్రివేళ యిళ్ళకొస్తారు. పగలంతా మస్తుగా తిని నిద్రపోయి రాత్రంతా మెలుకువగా వుంటారు.

మల్లః—అందుకేరా మన తాతలనాటి రోజులకంటే యీ రోజుల్లో దొంగతనం చెయ్యడం కత్తిమీద సాము లాంటిది.

ఎల్లః—ఆ కాలపు మనుషులు రాత్రి 9 గంటలకే నిద్ర పోయేవారు.

మల్ల—అందులోను ఆకాలంలో ఎలట్రీ దీపాలు లేవు. మన పూర్వీకులు చీకటిళ్ళల్లో తేలిగ్గా దూరి సొమ్మెత్తుకు పోతూవుండేవారు——ఈరోజులలో ఏముంది? చీకటి గదేకదా అని మనం దూరగానే, యింటి యజమాని టుప్పున మీట నొక్కగానే ఎలట్రీదీపం ఎలిగిపోతాది; మనందొరికిపోతాం.

ఎల్లః—అంతే కాదురా! ఆ రోజులో దొంగలు పడ్డారు మొర్రో అని ఎంతఅరిచినా——మనకి జడిసి——ఎవ్వరూ వచ్చేవాళ్లుకాదు. ఇప్పుడేముంది? యీలేస్తె పోలీసొస్తారు. యింటి యజమాని ఫోనులో మాటాడితే సిపాయీలు తుపాకీలు పట్టుకుని వస్తారు.

మల్ల : అయినా మనం జడిసిపోడంలేదు. యిన్ని కట్టుదిట్టాలున్నా మనంజయంగా సొమ్మెత్తుకు పోతున్నాం (ఉత్సాహంతో) ఒరేయ్ ఎల్లయ్యా యీరోజుల్లో మన తాతలుంటే మన తెలివికి ఎంత సంతోషించేవోరురా!

ఎల్ల : (నిస్పృహతో) ఏం సంతోషంరా ఎర్రిబుల్లి

బాబు! మనతాత ముత్తాతలు ఎన్ని సార్లోకన్నాలేశాస
అయినా జెయిళ్ళంటే ఎలాగుంటాయో ఆళ్లకు తెలియదు.
మనం సూడు! అప్పుడే మూడుసార్లు జెయిలుకెళ్ళొచ్చాం.

మల్ల : ఒరేయిఎల్లయ్యా! నాకెన్నాళ్ళనుంచో ఓ సందేహం వుందిరా.

ఎల్ల : మనం యిన్నేళ్ళనుంచి దోపిడీలు సేస్తున్నాం గదా మనదగ్గిర కుక్కిగవ్వయినా నిలవలేదేంరా?

ఎల్ల : (తేలిగ్గా నవ్వి) ఓస్ ఆమాత్రం తెలియదుట్రా మనకి యీశ్వరుడి శాపం వుందంట! ఎంత సొమ్మొచ్చినా తినేసి తిరిగేసి ఖర్చుపెట్టెయ్యాలంట. అందులో దమ్మిడీ మిగిలించినా పాపమంట!

మల్ల : నాకీ శాపాలమీద, పాపాలమీద నమ్మకం లేదురా! అయినా యింక యీ దొంగబతుకును వదిలిపెట్టక పోతే లాభం లేదురా'

ఎల్ల : ఒరేయిమల్లయ్యా! మనం యిద్దరం జంటగా ఎన్నో దొంగతనాలు సేశాం. జైళ్ళకెళ్లాం. తాపులుతిన్నాం బురిలు బద్దలుకొట్టించుకున్నాం.

మల్ల : పసువుల కంటే హీనంగా బతికాం.

ఎల్ల : పోయినతడవ జైలునుంచి వస్తూ—యింకెప్పుడూ దొంగతనాలు సెయ్యకూడదని—దారిలో ప్రమాణకాలు సేసుకున్నాం.

మల్ల: అయినాయివేళ దొంగతనానికి తిరిగి బయలుదేరాం.

ఎల్లి : నిజంగా బుద్ధిపూర్వకంగా దొంగతనం సెయ్యాలని మనకి లేదురా! మనచేత రోజులిలా సేయిస్తున్నాయిరా! బాబూ! (విషాద దృక్కులతో మల్లయ్యను చూస్తాడు.)

మల్లి : ఇదంతా మనకర్మం కాకపోతే నీ పెళ్ళానికి యిప్పుడే జబ్బు రావాలంటరా?

ఎల్లి : (విచారంతో) అది బతుకుతాదో లేదో సెప్ప లేనురా! అదిగాని సచ్చిపోతే నలుగురు పిల్లల్ని తీసుకుని నేనే నూతిలో పడాలిరా మల్లయ్యా! (కన్నీళ్లు తుడుచుకుంటాడు)

మల్లి : ఇసారించకురా! మనం ఏం సెయ్యగలం! ఆ బగమంతుడి మీద బారం వేసి వూరుకుందాం. డాక్టేరే మన్నాడు?

ఎల్లి : పదివొందలైనా ఖర్చు సేసి మందు సేయించక పోతే లాభం లేదన్నాడురా!

మల్లి : ఈ పెపంచకంలో మనలాంటి బీదోళ్ళం వున్నాం సూశావూ—కాలూ సెయ్యి వొంగకుండా వున్నంతకాలమే మనుసులం. ఆతర్వాత పసువులకంటే కనాకష్టం.

ఎల్లి : ఆ బగవంతుడు దొంగోళ్లకు కూడా పిల్లల్ని ఎందుకిచ్చాడో?

మల్లి : అసలా దేవుడు దొంగోళ్లని ఎందుకు పుట్టించేడో?

ఎల్లి : (కుడివైపు చూస్తూ ఆతురతతో) ఒరేయి మనుష్యులొస్తున్నారురా! జాగర్త! సెట్లయెనక్కి నడు!

[ఇద్దరూ తొందరగా చెట్లవెనుక దాక్కుంటారు. కామరాజు ప్రవేశిస్తాడు. అతనివెనుక సుబ్బయ్యా, వెంకయ్యా కర్రలుపట్టుకొని వినయంగా మాట్లాడుతూ కుడివైపునుంచి ప్రవేశిస్తారు. కామరాజువయస్సు 30 ఏళ్లువున్నా 25 ఏళ్ల యువకునిలా కనిపిస్తాడు. సన్నగా పొడవుగా వుంటాడు. సిల్కుచొక్కా; గ్లాస్గోపంచె; షోగ్గాకత్తిరించిన మీసాలు; వేళ్లకు ఉంగరాలు; చేతికి రిస్టువాచీ నవనాగరికుడివలెబాగా డబ్బున్నవాడిలా కనిపిస్తాడు]

కామరాజు : ఒరేయి సుబ్బయ్యా! మొన్న నీకు చెప్పాను చూశావ్రా దేవాలయంపక్కయింట్లోఒకఅమ్మాయి వుందని.

సుబ్బయ్య : మేమూ చూసొచ్చామండి! సాలా అందంగావుందండి ఆపిల్ల. ఏరా ఎంకయ్యా!

వెంకయ్య : ఓ! సక్కగా సందమామలా వుందండి!

సుబ్బ : ఆపిల్ల సచ్చిపోయిన నర్సింహంగారి అమ్మా యంటండి!

వెంక : ఇంతకాలం ఆళ్లసిన్నాన్న పెంచేడంటండి. పాపం! ఆ సిన్నాన్న కూడా సచ్చిపోతే ఆపిల్ల అన్నగార్ల దగ్గరికి వచ్చేసిందంట. (సుబ్బయ్యాకేసి తిరిగి) అంతేకాదట్రా సుబ్బయ్యా!

సుబ్బ : ఆళ్లంతా కష్టాలలో వున్నారండి. ఈ సమ యంలోగాని మీరు తలుసుకున్నారంటే ఆపిల్ల యిట్టే దొరికి.

పోతాదండి.

కామ : (సంతోషంతో) మీలాంటి నమ్మకమైన నౌఖర్లు దొరికినందుకు నేను చాలా సంతోషిస్తున్నానురా! మీరిద్దరూ సమాచారం చాలావరకూ సేకరించుకువచ్చారు

సుబ్బ : (ఉత్సాహంతో) మరోవారం రోజులలో అంతా సెటిల్ సేసెయ్యకపోతే నాపేరుసుబ్బయ్యే కాదండి!

కామ : నువ్వేం శ్రమపడక్కర లేదురా. నేనేస్వయంగా అంతా సెటిల్ చేసుకువచ్చాను.

సుబ్బ : (నిరుత్సాహంతో)అలాగంటండీ!

వెంక ; ఎలాగైనా బాబుగారు తెలుసుకున్నారంటే వదిలెయ్యరు.

కామ : ఆఅమ్మాయిపేరురాధ. ఈవేళ ఉదయం ఒక స్నేహితుడి యింటిలో కలుసుకున్నాను. ఆ స్నేహితుడి చెల్లెలు యీమె చిన్నప్పుడు చదువుకున్నారట. స్నేహితుడి చెల్లెలికి యీవేళ పుట్టినరోజు. టీపార్టీ జరిగింది. ఆ సీపార్టీలో రాధను కలుసుకున్నాను. జంకూ గొంకూ లేకుండా నాతో మాట్లాడింది. ఫర్వాలేదుకదా అని నాకారులో ఎక్కించుకున్నాను. రాదేమోఅనుకున్నాను. కానినిస్సంకోచంగా కారులో నాపక్కను కూర్చుంది. కారునుక్షణంలో బీచిరోడ్డు వైపు మళ్ళించాను.

సుబ్బ : (సంతోషంతో) సెబాష్! యింకనేం! బాబుగారి రొట్టె నేతిలో పడింది.

కామ : నేతిలో పడితే సంతోషిద్దుం—కానిఅదినేౕ సముద్రపు ఉప్పునీళ్లలో పడింది.

సుబ్బ, కామ : (నిరుత్సాహంతో ఒక్కసారిగా) అదేం బాబూ?

కామ : పిలిచినవెంటనే బీచికి వచ్చిందిగనుక నన్ను తప్పకుండా ప్రేమించిఉంటుందని అపోహపడ్డాను.

సుబ్బ : ఏం బాబూ? మీారంటేయిష్టంలేదా?

వెంక : ఎదురుతిరిగిందా బాబూ?

కామ : నామీాద మక్కువవుందని తలచిఆమెకు నా ప్రేమను తెలియజేశాను.

సుబ్బ : (అతుృతతో) చిత్రం! అప్పుడేమందండి?

కామ : మీాకు యింతవరకూ పెళ్లి కాలేదా అని అమాంతంగా ప్రశ్నించింది.

వెంక : తమరేం జవాబు సెప్పేరు?

కామ : (తనప్రసంగాన్ని కొనసాగిస్తూ) ఇటువంటి ప్రశ్న వేసిందేమిటిరా దేవుడాఅని మొచటకంగానుపడ్డాను. నాకు పెళ్ళిఅయిందనీ, యిద్దరు పిల్లలుకూడా వున్నారని తెలిస్తే ఆమె నన్ను తప్పకుండా దూరంగా వుంచుతుందని వూహించాను. వెంటనే నాకుపెళ్ళికాలేదని తిరుగులేని అబద్ధం చెప్పేశాను.

సుబ్బ : అప్పటికైనా తమ ప్రేమను ఒప్పుకుందా బాబూ?

కామ : ఒప్పుకుంటే యిక కావలసిం దేముందిరా? యిదెక్కడో కొరకరానికొయ్యలావుంది. (అసలు విషయం జ్ఞాపకి వస్తూ) యిదంతా మీకు ఎందుకు చెబుతున్నానో తెలిసిందా! రేపటినుంచి మిమ్మల్నిద్దరినీ రాధ దగ్గరకు పంపిస్తూవుంటాను. మీరుపొరపాటునైనా నాకు పెళ్ళి అయ్యిందని, పిల్లలున్నారనిఆమెతో చెప్పారా మిమ్మల్ని ఉద్యోగాల్లోంచి అమాంతం తీసేస్తాను జాగ్రత్త!

వెంక:-మాకామాత్రం తెలియదటండీ బాబుగారూ!

సుబ్బ:- ఇంతకూ వ్యవహారం ఏమీ కుదరలేదన్న మాట !

కామ:-(చిరాగ్గా) లేదురా! బాబూ! లేదు! పెళ్ళి చేసుకోమని అడుగుదామని ఆమె ఉద్దేశ్యం. కాని నన్ను అడగదు. నాచేతే అడిగించాలని ఆమె ఉద్దేశం. ఎక్కడో నెరజాణలా వుంది!

సుబ్బ:-గట్టిసికెక్కే తెచ్చి పెట్టిందే! మళ్ళీపెళ్ళెలా సేసుకుంటారు?

కామ:- రాధను చూచినప్పటినుంచీ నా మనసు మారిపోయిందిరా సుబ్బయ్యా! ఇక తప్పనిసరి అయితే ఆమెను పెళ్ళి చేసుకుంటాను.

సుబ్బ:-(భయంతో) అమ్మబాబ్బో! అమ్మగారుండగానే!

స్త్రీగొంతు:—(సరిగా యీమాట అనే సమయంలో లోపలనుంచి) ఒరేయిసుబ్బయ్యా! బాబుగారింకారా లేదూ?

సుబ్బ:- (భయంతో) వచ్చేరమ్మా!

కామ : (భయంతో) ఇంకా అమ్మగారు నిద్రపోలే దటరా? (ఎడమవైపుచూస్తూ) కొంప మునిగింది. వస్తోంది. ఇక ప్రారంభిస్తుంది గొడవ!

(ఎడమ వైపునుంచి రత్నావతి ప్రవేశిస్తుంది. వయస్సు 25 సంవత్సరాలు. ముఖం చూడగానే చాలా నెమ్మదైన మనిషనిపిస్తుంది. మెడలో విలువైనఆభరణాలు వుంటాయి)

రత్నావతి : అర్థరాత్రి వేళకూడా యిల్లు చేర కోకపోతే ఎలాగండి? లంకంతకొంపలో నేనొక్కతనూ ఎలా వుంటగలను చెప్పండి? (సుబ్బయ్య వెంకయ్యలతో) మీ రిద్దరూ వెళ్ళి గేటుదగ్గర పడుకోండి. యీ మధ్య దొంగ లెక్కువగా తిరుగుతున్నారట. జాగ్రత్త!

సుబ్బ : మనయింట్లోఅడుగుపెట్టినతరవాతదొంగోడు బతికిబయటపడతాడనుకోకండి!

వెంక : మేంవున్నంతకాలం మీకు అలాంటి భయా లుండవు. పోయి పడుకోండీ అమ్మగారూ! (సుబ్బయ్య, వెం కయ్య కుడివైపు వెళ్ళిపోతారు.)

రత్నా : (వాళ్ళు పోతున్నవైపు చూస్తూ) మీకు తగిన నౌకర్లే దొరికారు. బాబుగారు యింకా రాలేదు.

పిలుచుకురండిరా అంటే—కాలుకదపకుండా నేజవాబుచెప్పే స్తారు. మీకు ఇంతవయస్సువచ్చినా యిద్దరుపిల్లల్నికన్నా మీలో చిన్నతనపుచేష్టలు కొంచెంకూడా తగ్గలేదు.

కామ : (విసుగ్గా) అయితే నేనేంచేస్తున్నానంటావ్?

రత్నా : ఏంచేస్తున్నారు? పగలంతా క్లబ్బులలో డబ్బు తగలేస్తున్నారు. రాత్రిలంతా ఆడనాళ్ళను వెంట బెట్టుకొని తిరగరాని చోట్లలో తిరుగుతున్నారు. మీరుఎంత కాలానికి దారిలోకి వస్తారో తెలియడంలేదు.

కామ : చూడురత్నం! నువ్వుఅనవసరంగా మనసు పాడుచేసుకుంటున్నావు. నన్నుగురించి లేనిపోనివిషయాలన్నీ వూహించి బాధపడుతున్నావ్.

రత్నా : (కోపంతో) మీరంటే కిట్టక మీమీద అబద్దాలు చెబుతున్నానంటూరా? మీకు కనకవల్లికి నెక్లేసు బహుమతియివ్వడం అబద్ధమా? ఆమెతో బీచిలో తిరగడం అబద్ధమా? (విచారంతో) ఆకళ్ళు తెరవని పసిపిల్లల ముఖం చూసిఅయినా కొంచెం బుద్ధిగా మసలండి!

కామ : (కోపంతో) ఇప్పుడునన్నేంచెయ్యమంటావు?

రత్నా : మీరేం చెయ్యనక్కర్లేదు. భగవంతుడు మీకు కావలసినంత ఐశ్వర్యాన్ని యిచ్చాడు. రత్నాలవంటి పిల్లల్ని యిద్దరిని ప్రసాదించాడు. కాలుకదపకుండా సుఖంగా హాయిగా మిమ్మల్ని యింట్లోవుండమనే నేను కోరేది.

కామ., సరదాలు తీర్చుకోకుండా, స్నేహితులతో

తిరగకుండా పై దీలా ఎప్పుడూ యింట్లో కూర్చోమంటావా?

రత్నా : ఇంట్లో వుండడం మీకు యిష్టం లేకపోతే బయటతిరిగినా చెడ్డవాళ్ళ సావాసం చెయ్యకుండా వేళకు ఇల్లుచేరుకుంటే చాలు నేను సంతోషిస్తాను.

కామ : (హేళనగా). గొప్పపని చేస్తావు! నువ్వు సంతోషించకపోతే నాకొంప మునిగిపోతుందికాబోలు!

రత్నా ; కష్టపడుతున్న యిల్లాలి కన్నీటి బిందువు ఏ యింట్లో రాలుతుందో ఆ యింట్లోసుఖసౌభాగ్యాలువుండవు. ఈవిషయం మీరు బాగా తెలుసుకోవాలి!

కామ : నీదగ్గర ధర్మపన్నాలు నేర్చుకోవలసినంత అజ్ఞానిని కాదులే.

రత్నా : స్త్రీ, త్రాగుడు, జూదం యివన్నీ— విజ్ఞానికి వుండవలసిన లక్షణాలు అనుకుంటాను!

కామ : (కోపంతో) యిక నీ అధిక ప్రసంగం కట్టిపెట్టు యింతవరకూ నువ్వేమన్నా సహిస్తూ వచ్చాను. దేనికైనా హద్దువుంది.

రత్నా : అదే! నేనుచెప్పేదీని! దేనికైనా హద్దు వుండాలి. మీరు ఎలాతిరిగినా వేళకుయిల్లు చేరుకుని కొంత సేపైనా పిల్లలతో, నాతో సంతోషంగా కాలంగడిపితేచాలు. సంతోషిస్తాను. పెద్దకుర్రాడికి నాలుగేళ్ళవయసు వచ్చింది. వాడిని ఒక్కసారైనా మీతో బయటకు తీసుకు వెళ్ళరా? వాడు మీతోవస్తానని ఎన్నిసార్లు ఏడ్చాడు! (క్షణం ఆగి)

అవును! మీతో ఎలా తీసుకువెడతారు! వాడు మీతో వుంటే మీపనులన్నిటికీ అడ్డుకదూ?

కామ : (విసుగ్గా) అబ్బబ్బ! అర్ధరాత్రి అయినా యింకా నీపోరు నాకు తప్పదనుకుంటాను.

రత్నా : (కళ్ళు తుడుచుకుంటూ) నన్నా భగవంతుడు వేగం తీసుకుపోతే నాపోరుమీకు శాశ్వతంగా తప్పిపోతుంది.

కామ : (నిస్పృహతో) హరి భగవంతుడా! మాట మాటకు చావునుకోరుకునే దుర్బలత్వాన్ని స్త్రీలలో ఎందుకు సృష్టించావురా?

రత్నా : అసలు భగవంతుడు స్త్రీలను—కాలుకదప కుండా, నోరు మెదపకుండా—ఒకచోట పడివుండే పనికి మాలిన వాళ్ళుగా సృష్టించాడు. యీ అనర్ధకాలన్నిటికీ అదే మూలకారణం!

కామ ; (ప్రసంగాన్ని మార్చే ధోరణిలో) పిల్లలు నిద్రపోయారా?

రత్నా : నిద్రపోక యేంచేస్తారు? యిదివరకు మీ కోసం చూసేవారు. యిప్పుడు వాళ్ళకూ అలవాటు తప్పి పోయింది.

కామ : అదీ మంచిదే!

రత్నా : మీకు అన్నీ మంచివే! రేపు ఏ దొంగలో వచ్చి పిల్లలగొంతూ నాగొంతూ నులిమి పారేస్తే మీకు యింకా మంచిది. మీఅడ్డు పూర్తిగా వదలిపోతుంది. అప్పుడు మీరు స్వేచ్ఛగా తిరగవచ్చు.

కామ : (కోపంతో) యిక నీనాగుడుకు అంతు వుండ దనుకుంటాను. (నిస్పృహతో] ఎంత ఐశ్వర్యం వున్నా నా ప్రాణానికి సుఖంలేదురా భగవంతుడా!

రత్నా : ఐశ్వర్యంమూలాన్ని మన ప్రాణానికి సుఖంలేదని పిస్తోంది. నాకు. చూడండి, ఈలోకంలో కోటాను కోట్ల దరిద్రులున్నారు. వాళ్ళుభూమిమీదపుట్టి, ఏచెట్టునీడలోనో పెరిగి పెద్దవాళ్లవుతున్నారు. కష్టపడి చెమటోడ్చి పెళ్ళాం పిల్లలను పోషించుకుంటున్నారు. వాళ్ళతో పోల్చి చూసు కుంటే వాళ్ళుపొందే ఆనందంలో నూరవవంతైనా మనకు లేదనిపిస్తోంది.

కామ : (నిరసనగా) దరిద్రుల కొంపలోంచి వచ్చి నందుకు నీదరిద్రగొట్టుబుద్ధి ఎక్కడకు పోతుంది?

రత్నా : మీకు నిరసనగా వుండవచ్చు. కాని నేను దరిద్రులయింట్లో పుట్టినందుకు గర్విస్తున్నాను. నేను నిరు పేదల యింటినుంచివచ్చినందువల్లనే నాలో జాలి, కరుణ మొదలైన సద్గుణాలు శాశ్వతంగా నిలిచివున్నాయని నమ్ము తున్నాను—మీరు ధనవంతులు గనుక మీయింట్లో వుంటే నేను శాశ్వతంగా సుఖపడతాననే ఆశతో మానాన్న తన రక్తమాంసాలు ధారపోసి—కోరిన కట్నంయిచ్చి—నన్ను మీకు పెళ్ళిచేశాడు. తనఅంచనా పూర్తిగా తప్పినందుకు —ఆయన బ్రతికివుంటే— యిప్పుడెంత దుఃఖించేవాడో! (పైటచెంగుతో కళ్లుతుడుచుకుంటుంది)

కామ : (రాజీధోరణిలో) ఇప్పుడెందుకు ఆ గడిచి పోయిన గాథలన్నీ తవ్వుకుని బాధపడడం! అర్ధరాత్రి గడచి పోయింది. రా! లోపలికి పోదాం. (ఆమె చెయ్యి పట్టుకొని ఆమెతో ఎడమవైపుగాని ప్రక్కమిస్తాడు....మల్లయ్య ఎల్లయ్య చెట్లవెనుకనుంచి తిరిగి ప్రవేశిస్తారు)

మల్ల : డబ్బున్నవాళ్ళు సుఖంగా వుంటారనుకోడమే గాని ఆళ్ళ బతుకంతా గోలేరా!

ఎల్ల : అసలు డబ్బున్నవాళ్ళ ప్రపంచకమే వేరురా! అన్నంలేక మనం అగోరిస్తావుంటే తిన్నది అరగక ఆళ్ళు బాధపడతన్నారు.

మల్ల : వీళ్లసొత్తులో కొంత మనం ఎత్తుకుపోతే వీళ్లకు ఉపకారం సేసినోళ్లం అవుతామేమో ననుకుంటు న్నానురా!

ఎల్ల : సేతినిండా డబ్బుంటే ఎవడికైనా కళ్లుమూసుకు పోతాయిరా!

మల్ల : ఆడబ్బుకాస్తా ఆరతి కర్పూరంలా గాలిలో కలిసిపోతే కళ్లు మారాజుల్లా తెరుసుకుంటాయి!

ఎల్ల : ఇలాంటోళ్లనిగురించి మనం జాలిపడగూడ దురా! బంగారం బొమ్మలాంటి పెళ్లాం వున్నా సుఖపడడం సేతగాని యీ కామరాజుకి బుద్ధిసెప్పాలిరా!

మల్ల : నేను యిక్కడనిలబడి మనుషు లొస్తున్నా రేమో సుత్తావుంటాను. నువ్వు లోనకెళ్లి ఆనుపానులన్నీ సూసుకురా!

ఎల్ల : యిందాకొచ్చేరు సూశేవా— ఆ నౌకరు గాళ్లు—ఆళ్లని కొంచెం జాగ్రత్తగా కనిపెడుతూవుండు.

మల్ల : అలాంటికాపలా కుక్కలకి మనం జడుత్తామంటరా! (కోపంతో) డాబుసేత్తన్నారు యెతవకొడుకులు! దొంగోళ్లని పేణంతో వదలిపెట్టరంట!

ఎల్ల (గోపంతో) ఆళ్లకర్రలతో కోలాటం ఆడిద్దును. —సమయంకాదని వూరుకున్నానుగాని!

మల్ల : (నిర్లక్ష్యంగా) ఆళ్లేం సేత్తారుపోరా! పోయి అంతా సూసుకొని సప్పనరా!

[ఎల్లయ్య చెట్లచాటున నక్కుతూ, అడుగులలో అడుగులు వేసుకుంటూ ఎడమ వైపు నిష్క్రమిస్తాడు. మల్లయ్య ముందుకూ వెనుకకూ పరకాయించిచూస్తూఅటూ యిటూ తిరుగుతూ వుంటాడు. రెండు నిమిషాలు గడిచిన తరవాత ఎడమవైపునుంచి ఎల్లయ్య తిరిగి ప్రవేశిస్తాడు)

మల్ల : (ఆత్రితతో) ఆళ్లునిద్రపోయేరటరా!

ఎల్ల : లేదురా! అవతలవేపు వరండాలో కూచుని యింకా కేక లేసుకుంటున్నారు.

మల్ల : (నిరుత్సాహంతో) అయితేమనం యిియ్యేళ వుట్టి సేతులతో యింటికి పోవలసిందేనట్రా?

ఎల్ల : ఉపాయం వుండాలిగాని వుట్టిసేతులతోఎందుకు పోతాంరా?

మల్ల : (ఉత్సాహంతో) ఏటిరోయ్ ఆవుపాయం?

ఎల్లి : ఆమొగుడూ పెళ్లాలిద్దరూ అవతలి. వరండాలో కూచుని కజ్జా పెంచుకుంటున్నారు. ఆళ్ల వాటంసూత్తే యిప్పు డప్పుడే వూరుకునేలాగ లేరు. డబ్బున్నగదితలుపులు తెరిసి వున్నాయి. ఆళ్లకి కనబడకుండా యిటువేపు నుంచి గదిలో దూరవచ్చు!

మల్లి : (సంతోషంతో) అయితే యికనేంరా! సెణం లో పని కానిచ్చుకువచ్చేద్దాం.

ఎల్లి (సంశయిస్తూ) కాని మరోసిక్కు ఉందిరా!

మల్లి : (నిరుత్సాహంతో) ఎటిరాబాబూఆసిక్కు?

ఎల్లి : అగదిలో యిద్దరు సంటిపిల్లలు నిద్రోతు న్నారురా!

మల్లి : సంటిపిల్లలున్న యింటికి కన్నం వెయ్యడం కష్టమేరా. ఏదైనా గళ్లుమని సప్పుడయితే ఆళ్లు కెవ్వుమని కేకేస్తారు.

ఎల్లి : ఒరేయిమల్లయ్యా! దానికోవుపాయం సెపు తున్నాను. జాగ్రత్తగా! యినుపిల్లలు 'కుంయ్' మంటే సాలు —కోడిపీకనులిమినట్లు—పీకనులిమి పారెయ్! దానితో మన పని జయంగాపూర్తి చేసుకు వచ్చేస్తాం.

మల్లి : (జాలిగా) ఒరేయి యల్లయ్యా! పిల్లలుగలో డువు అలాటిపాపపు పని సెప్పకురా! నోరులేని పిల్లలు దేవుడులాంటోళ్లు. ఆళ్ళు మనకేం అపకారం సేసేరు సెప్పు. వుత్తిపున్నేనికి ఆళ్ళని సంపెయ్యడానికి నామనసొప్పదురా!

ఎల్లి : నాకూ అలాంటి పని సెయ్యడం యిష్టం లేదురా. కాని ఆళ్ళులేస్తే మనం దొరికిపోతాం. యివతల డబ్బా దొరకదు—అవతల లాటీ కర్రపోట్లు, జైలు తప్పవు.

మల్లి : నువ్వెన్ని సెప్పు: నేను మాత్రం అలాంటి పాపపుపని సెయ్యను. నోరులేని పిల్లల్ని మనం రచ్చిస్తే దేవుడు మనల్ని రచ్చిస్తాడు.

ఎల్లి : దేవుడు రచ్చించినా, రచ్చించకపోయినా పోలీసులు మనల్ని బచ్చిస్తారు.

మల్లి : యేమైనాసరే! పిల్లల్నిసంపననిమాటయిస్తేనే నేను నీతో గదులోకొస్తాను. లేకపోతే రాను.

ఎల్లి : ఒకళ్ళని సంపడంఅంటే మనకిమాత్రం సరదా అంటారా! అలాగే సంపొద్దులే నడు! మనంవచ్చిన యేళా యిశేషం బాగుంటే ఆళ్ళు లేవరు. లేకపోతే మళ్లారెండేళ్ళు జైలుసేసొస్తాం! పద!

[యిద్దరూ ఎడమవైపు నెమ్మదిగా అడుగులు సవ్వడి కాకుండా నిష్క్రమిస్తారు—తెర]

## రంగము - 2

* * స్థలం : జగన్నాథ దేవాలయం—సమయం : అదేరోజు రాత్రి 10 గంటలు. దీపపుకాంతిలో దేవుని విగ్రహం దివ్యకాంతులను వెదజల్లుతూవుంది. ఆగి ఆగి ప్రక్క

నుంచి వినిపించే గుడిగంటలచప్పుడు నిశ్శబ్దతను భగ్నపరు స్తోంది. అర్థనిమీలిత నేత్రాలతో ధ్యాననిష్టలో మునిగి సీతా రాం దేవుడి ముందు కూర్చున్నాడు. అతని ముఖం అతి ప్రశాంతంగా వుంది. దేహం శుష్కించిపోయింది. కళ్ళలో తేజస్సు కనిపిస్తోంది. పంచెకట్టుకున్నాడు. చిరిగినపాత పట్టు పంచె కప్పుకున్నాడు. వయస్సు 30 సంవత్సరాలు—ఎడమ వైపునుంచి రాధ ప్రవేశిస్తుంది. తెల్లగా, అందంగా, పొడ వుగా వుంది. ముఖంలో ఉత్సాహం కనిపిస్తోంది. వయస్సు 20 సంవత్సరాలు. దేవుడినీ సీతారాంనీ ఒక క్షణం పరిశీల నగా చూస్తుంది.

రాధ : అన్నయ్యా!

సీతా (బాహ్య ప్రపంచంలోకి వచ్చి వెనక్కి తిరిగి) ఏం రాధా?

రాధ : రాత్రి పది గంటలు దాటిపోయింది. ఇంకా యింటికిరావా?

సీతా : జగన్నాథుని కరుణ సంపాదించనిదే నేను యింట్లో అడుగు పెట్టను రాధా.

రాధ : రోజురోజుకూ నువ్వు పిచ్చివాడవు అయి పోతున్నావన్నయ్యా! ఆ రాతి దేవుడు నిన్ను కరుణిస్తాడను కుంటున్నావా?

సీతా : సమస్త జీవకోటినీ సృష్టించిన దేవుడు మానవ జీవితాలపై కమ్ముకొన్న కారుమేఘాలను తొలగించక పోడు

కాని అజ్ఞానంతో, తొందరపాటుతో మానవుడు దేవుణ్ణి తృణీకరించడానికి ప్రయత్నిస్తున్నాడు.

రాధ : నువ్వు పొరపాటు పడుతున్నావు అన్నయ్యా! రోజులు మారిపోయాయి. మనం యీనాడు పరమాణు యుగంలో వున్నాం. నేడు మానవునకు సాధ్యంకాని దేదీ యీ ప్రపంచంలో లేదు. మానవునికంటే అధికు డెవరూ ఏ లోకంలో లేరు.

సీతా : (కోపంతో) అపచారం! దేవుడి సమక్షంలో దేవుణ్ణి నిరశిస్తున్నావా రాధా! (నిట్టూర్పువిడిచి) అవును! నీలో భక్తిభావా లెలా కలుగుతాయి? భౌతికవాది అయిన చిన్నాన్న దగ్గర యింతకాలంవరకూ పెరిగిన నీకు ఆ సిద్ధాంతాలు పట్టుపడడంలో ఆశ్చర్యం ఏముంది?

రాధ : దేవుడిమీద విశ్వాసంకంటే ఆత్మ విశ్వాసం మనిషికి ముఖ్యం అన్నయ్యా! కష్టపడి చెమటోడ్చి పని చెయ్యాలి. మానవ సమాజాన్ని పురోగమింప చెయ్యాలి. అప్పుడు దేవుడుకూడా సంతోషిస్తాడు. అంతేకాని దారిద్ర్యాన్ని తట్టుకోలేక నిరుత్సాహపడి, జీవిత సంగ్రామంలో ఓడిపోయి—'నువ్వు తప్ప నాకేం దిక్కులేదని'—దేవుణ్ణి పట్టుకుంటే దేవుడుమాత్రం ఏం చెయ్యగలడు అన్నయ్యా?

సీతా : అక్కడే పొరపాటు పడుతున్నావు చిట్టిచెల్లీ కష్టకాలంలో మనిషికి దేవుడొక్కడేదిక్కు. సృష్ట్యాదినుంచీ దేవుడు తన భక్తులను కాపాడుతూ వచ్చాడు. నాకు దేవుడి

మీద పరిపూర్ణ విశ్వాసంవుంది. మనకష్టాలు గట్టెక్కేవరకూ నేనిక్కడే నిరశనవ్రితం చేస్తాను. (ఉద్రేకంతో) మనదరిద్రం తీరకపోతే భగవంతుడి సమక్షంలో ప్రాణత్యాగం చేస్తాను.

రాధ : నువ్వు యీకాలంలోవుండవలసినమనిషివికాదన్నయ్యా! మానవ ప్రయత్నంలేనిదే యీ లోకంలోఏపనీ కాదు. నువ్వుకూడా కష్టపడి పనిచెయ్యి. అప్పుడు మనపరిస్థితులు కొంతగాకపోతే కొంతైనా బాగుపడతాయి. చిన్నన్నయ్య చూడు! పాపం! రోజంతా కష్టపడిపనిచేస్తున్నాడు. వాడుకూడా నీలా తయారయితే మనకుటుంబం ఏమయేది?

సీతా : గౌరీపతి యింకాయింటికి రాలేదా?

రాధ : లేదు. పాపం! కేవలం రోజుకు రెండురూపాయలకోసం ఉదయం 8 గంటల నుంచి రాత్రి 10 గంటల వరకూ రక్తమాంసాలను ధారపోసి పనిచేస్తున్నాడు.

సీతా : అంతా భగవదేచ్ఛ!

రాధ ! (కోపంతో) ఒకమనిషిమీద మరో మనిషి స్వారీచెయ్యడంకూడా భగవంతుని యిష్టమేనా?

[ఈమాట అంటున్న సమయంలో ఎడమవైపునుంచి గౌరీపతి వస్తాడు. అతుకులువేసిన చొక్కా, మాసిన ఫుల్ ఫాంటు, పాతబూటు వేసుకున్నాడు. జుత్తుచిందర వందరగా ముఖంమీద దపడుతోంది. కళ్ళు ఎర్రగా చింతనిప్పులలా వున్నాయి. మనిషినిచూడగానే యిట్టే కోపంవచ్చే స్వభావం కలవాడని తెలుస్తుంది.]

గౌరీపతి : ఏంరాధా! అర్ధరాత్రి అవుతున్నా యింకా యీ దేవుడి కొలువు మనకు తప్పదా?

రాధ : అన్నయ్య ఇంకా భోజనం చెయ్యలేదు. పిలవడానికి వచ్చాను.

గౌరీ : ఇంతరాత్రివరకూ యిక్కడ ఎందుకున్నా వన్నయ్యా?

సీతా : నాయనా! గౌరీపతీ! నన్నీ ఈవేళ ఏకాంతంగా వుండనియ్యి. రాధను నీతో యింటికి తీసుకుపో. ఈ రాత్రంతా నేను జగన్నాథుని సమక్షంలో వుండిపోదలుచుకున్నాను.

రాధ : (గౌరీపతితో) మనయిల్లు దేవాలయం ప్రక్కనే వున్నందువల్ల యీ చిక్కంతా వచ్చిపడింది.

సీతా : దేవుడు నిత్యం మనకు అందుబాటులో వుండడం మన అదృష్టం!

గౌరీ : దేవుడు మనల నేదో ఉద్ధరిస్తాడనే పిచ్చినమ్మకంతో రోజంతా ఉపవాసం వున్నావా అన్నయ్యా? మాట ఎంత నీరసంగా వస్తువున్నదో చూడు! ఇలా శరీరాన్ని శుష్కింపచేసుకున్నందువల్ల ప్రయోజనం ఏమిటి?

సీతా : మీ తెలివితక్కువకు నాకు జాలికలుగుతోంది మీరు అంధకారంలో పడికొట్టుకుంటూ— దూరాన్నుంచి దేవుడు చూపిస్తున్న జ్యోతిని—కళ్ళు తెరచిచూడలేక నిందిస్తున్నారు. మనోనేత్రాన్ని తెరచి చూడగలిగితే నీకు తిన్నగా

దివ్యజ్యోతి కనిపిస్తుంది. అదే స్థిరం. అదే నీకుముక్తి నిప్రసాదించేది. నీ భౌతికదృష్టికి కనిపించే ప్రతి వస్తువూ నశించిపోయేదే! అశాశ్వతమైన వస్తువులనుచూచి—అవే నిజమని—అశాశ్వతమైన మానవప్రాణి భ్రమిస్తోంది.

గౌరీ : అన్నయ్యా! యింతవరకూ నీమీద వున్న గౌరవంతో నీమాటకు ఎదురుచెప్పలేదు. కానియిప్పుడుచెప్పవలసివస్తున్నందుకువిచారిస్తున్నాను.—నీసిద్ధాంతాలనునమ్మితే యిక యీప్రపంచానికి పురోగమనంవుండదు.—ఈదేవుడు వట్టిఅప్రయోజకుడని, ఎందుకూకొరగానివాడనిప్రత్యక్షంగా ఋజువు కనిపిస్తోంది.

సీతా : ఏమిటా ఋజువు?

గౌరీ : మననాన్నగారు తమజీవితాన్నంతా దేవుణ్ణి పూజిస్తూ వృథాచేశారు. చనిపోయే క్షణంవరకూ దేవుని కొలుస్తూనేవున్నారు. చివరకు దేవుని స్మరిస్తూ ప్రాణాలను విడిచిపెట్టేరు అదేమానవప్రాణీఅయితే నాన్నగారి కష్టాలకు హృదయం ద్రవించివుండేది. కాని నీరాతి దేవుడిలో రవంత చలనమైనా కలగలేదు—ఈదేవునిమీద చూపిన శ్రద్ధలో నాల్గవవంతైనా మనకుటుంబపు విషయంలో చూపితే మనం యీనాడు దరిద్రంతో యింతఅల్లాడవలసిన అవస్థ వుండేది కాదు. ఈదేవుడు చేతకానివాడని నిరూపించడానికి యింతకంటే సాక్ష్యం ఏంకావాలి?

సీతా : (శాంతంగా) అఖండజ్యోతికాంతిని చూడ

లేక కళ్ళుమూసుకొని పైగా దాన్ని నిందిస్తున్నావునాయనా! దేవుడు మనకష్టాలనుగమనిస్తున్నాడు. అచిరకాలంలోమనకు శుభంకలుగుతుంది.

గౌరీ : ఎందుకొచ్చినమాటలివి అన్నయ్యా!యిప్పటికైనా యీ మాయనుంచి తప్పుకొని మానవ ప్రపంచంలో అడుగుపెట్టు. కళ్ళు తెరచిచూడు! కోటానుకోట్ల మానవులు దరిద్ర రాక్షసితో హాహాకారాలతో పోరాడుతున్నారు. కొంత మంది స్వార్థపరులు తమసోదరమానవుల రక్త మాంసాలను అమ్ముకొని వ్యాపారం సాగిస్తున్నారు. నీవు రాత్రింబవళ్లు కొలిచే యీ భగవంతుడు ధనవంతులపక్షం వహించి వారి తరఫున ధర్మకర్తృత్వం వహిస్తున్నాడు.

సీతా : తప్పునాయనా! దేవుణ్ణి నిందించకు! దేవుడు ఎవరిపక్షం వహించడు. ఆయన నిష్పక్షపాతి. తనబిడ్డలందరూ సుఖసౌభాగ్యాలతో బతకాలనే ఆయనఆకాంక్ష!

గౌరీ : నలుగురు అన్నదమ్ములలో ఒకతమ్ముడు చేతగాని వాడవుతాడు. అప్పుడు వాడిని మిగిలినఅన్నలు నిర్దాక్షిణ్యంగా బయటకునెంటుతున్నారా? అటువంటప్పుడుకొందరు మానవులు దరిద్రులైనంత మాత్రాన వాళ్లను ధనవంతులు అష్టకష్టాలూ పెట్టాలా?

సీతా : మానవులలో ఆ విశాలదృక్పథం నశించిందినాయనా! అందుకు దేవుడేం చెయ్యగలడు?

గౌరీ : దేవుడేమీ చెయ్యలేడు. దేవుణ్ణి నమ్ముకుంటే

రోజులు గడవవు నువ్వు వాస్తవిక ప్రపంచంలో అడుగుపెట్టు (రాధను చూపిస్తూ) ఇం నైపెళ్ళవయసువచ్చినా—మనఒకే చెల్లెలు—రాధకు యింతవరకూ పెళ్ళిచెయ్యలేక పోయాం. మననాన్నగారే కనక బ్రతికివుంటే దానిని చూసి ఎంత దుఃఖించేవారో!

రాధ : అన్నయ్యా! నాగురించి మీరేమీ మనసు పాడుచేసుకోవద్దు! నేనువరుణ్ణి స్వయంగా ఎంచుకున్నాను.

గౌరీ : (చకితుడై) అదేమిటిరాధా? నువ్వెప్పుడూ నాతో చెప్పలేదే!

రాధ : అదే యివేళ చెప్పాలనుకుంటున్నాను.

సీతా : నీకునువ్వే వరుణ్ణి ఎంచుకోవడం ఆచార విరుద్ధమమ్మా!

గౌరీ : వరుడు మంచీవాడైతే ఆమె ఎన్నుకున్నందు వల్ల నష్టంలేదు. (రాధతో) ఎవరురాధా అతను?

రాధ : కామరాజగారు!

గౌరీ : (ఆశ్చర్యంతో) ఎవరూ! కామరాజా!రాధా! నీకింకా అనుభవం చాలదు. ధనవంతుడు త్రాచుపాములాంటి వాడు. ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా విషపు కోరలతో కాటువేస్తాడు.

రాధ : త్రాచుపాము క్రౌర్యం పాములవాడిముందు ఎందుకూ కొరగాదన్న విషయం కూడా నువ్వు తెలుసు కోవాలి.

సీతా : మనకంటే అధికులతో వియ్యం మంచిది కాదమ్మా!

గౌరీ : నేను మొదటినుంచీ కనిపెడుతున్నాను. మన రాధలో ధనకాంక్ష, ఆభరణాలమీద వ్యామోహం ఎక్కువగావుంది తనకోరికలను తీర్చుకోవడంకోసం యీమాధవం తుణ్ణి పెళ్ళాడడానికి నిశ్చయించుకుంది.

సీతా : దానికింకా చిన్నతనం. అటువంటి కోరిక లుండడం సహజం. అందులో తప్పేమీలేదు. ఏ మనిషీ తనంతతాను కష్టాలుకావాలని కోరుకోడు. (ఆకస్మికంగాగుడి గంటలసవ్వడి చెవులుచిల్లులుపడేటట్లు వినిపిస్తుంది. సీతారాం తొందరగా దేవుడు కేసిచూస్తాడు. తరవాతరాధా గౌరీపతుల కేసిచూస్తాడు.) అమూల్యమైన కాలాన్ని వృధాచేశాను. గౌరీ పతీ! ఇక రాధను తీసుకొని వెళ్ళిపో!

రాధ : ఈరోజుకు యిక భోజనం చెయ్యనక్లేనా అన్నయ్యా?

సీతా : ఈరోజు పూర్తిగా నిరాహారదీక్షతో దేవుణ్ణి పూజించదలచుకున్నాను. ఇక నా ధ్యానానికి భంగం కలిగించకండి, వెళ్ళిపొండి. (దేవుడివైపు తిరిగి కళ్ళు మూసుకుంటాడు)

గౌరీ : క్షణక్షణానికీనీకు వెర్రి ఎక్కువౌతోందన్నయ్యా (నిస్పృహతో) యికనిన్ను దారిలోకి తీసుకురావడంమానవమాత్రుడిశక్యంకాదు. రా. రాధా! పోదాం!

రాధ : అన్నయ్యను యిక్కడ ఒంటరిగా విడిచి పెట్టి పోవడమేనా?

గౌరి : మళ్ళీవద్దాం.

[యిద్దరూ ఎడమవైపుగా నిష్క్రమిస్తారు. దేవుడి ముందు పీఠంమీద తలవాల్చి పడుకుంటాడు సీతారాం — రెండునిముషాలునిశ్శబ్దం— ఎడమవైపునుంచి మల్లయ్య, ఎల్లయ్య వగర్చుకుంటూ పరుగెత్తుకువస్తారు. ఎల్లయ్య చేతిలో ఒకమూట వుంటుంది.]

మల్ల : పంటిపిల్లలు మనకొంపతీశారు. సరిగ్గాసామ్ముమూటకెడుతున్నప్పుడే యిద్దరూకలిసి కెవ్వుమనాలా?

ఎల్ల : అందుకేరాబాబూ పీక పిసికి పారెయ్యమని ముందేసెప్పేను నేను.

మల్ల : రామ! రామ! ఆమాట అనకురా! పంటి పిల్లలజోలికెళ్ళకపోతే మనల్ని దేవుడు రచ్చిస్తాడు.

ఎల్ల : (హేళనగా) యిప్పుడు రచ్చించేడు కాదూ దేవుడునిన్నూ!—ఆమొదవలిద్దరూ కర్ర లేసుకుని యిలాగే వస్తున్నారు. యిప్పుడేం సేత్తావో సెయ్యి!

మల్ల : ఇంకలాభంలేదురా. ఆళ్ళు వేసినగోలకియీారిలో జనం అంతా లేచిపోతూరు. యింకమనం తప్పించుకుపోడం కష్టం. ఆమూట తీసుకెళ్ళి దేవుడుముందుపారెయ్యి. మనం ఆమెట్లనకాల దాకుందాం. సొమ్ము దొరికిందిగందా అని మనల్ని వెతకడం మానేసి ఆళ్ళేపోతారు.

ఎల్లి : (విచారంతో) ఇంత కష్టపడి ఎత్తుకొచ్చిన సొమ్ము యిచ్చెయ్యవలసిందేనంట్రా మల్లయ్యా!

మల్లి : (ఆతురతతో) అంతకంటే ఉపాయంలేదురా. ఆళ్లు వచ్చేస్తున్నారు. సప్పాన దేవుడుముందు పారెయ్యి.

ఎల్లి : (ఒకఅడుగు ముందుకువేసి) ఒరేయ్! ఇక్కడెవడో మనిషి పడుకున్నాడురా!

మల్లి: (తొందరగా) పడుకుంటే పడుకోనియ్యి. నువ్వు దేవుడిముందు మూటపెట్టెయ్యి.

[దేవుడి విగ్రహానికీ, సీతారాంకూ మధ్య పీఠంమీద మూటపారేస్తాడు ఎల్లయ్య. మల్లయ్య, ఎల్లయ్య యిద్దరూ తొందరగా కుడివైపు నిష్క్రమిస్తారు. మూట పీఠంమీద విసిరేప్పుడు కలిగిన "గల్లు"మనే శబ్దానికి సీతారాంకళ్ళు తెరిచి చూస్తాడు. తిన్నగామూటకనిపిస్తుంది విప్పుతాడు. దానినిండా ధగధగ మెరిసే అమూల్యమైన ఆభరణాలు, రూపాయలూ కనిపిస్తాయి. సీతారాంకళ్లు ఆశ్చర్యంతో మెరుస్తాయి.)

సీతా : (దేవునివైపు తిరిగి) భగవాన్! ఏమిటి నీ మాయ!

[ఎడమవైపునుంచి సుబ్బయ్య, వెంకయ్య వగర్చుకుంటూ పరుగెత్తుకు వస్తారు. యిద్దరి చేతుల్లోనూ కర్రలు వుంటాయి. సుబ్బయ్యచేతిలో తాడుకూడా వుంటుంది]

సుబ్బ : (సీతారాంనుచూచి) దొరికేవురా దొంగ! (రెక్కపట్టుకొని లేవదీస్తాడు)

వెంక : (దగ్గరకువచ్చి) మామ్మల్ని తప్పించుకుపోదా మనుకున్నావా? హుఁ! (కఱ్ఱెర్ర జేస్తాడు)

సీతా : (శాంతంగా) ఏమిటీ నాయనా యిది!

సుబ్బ : (వెంకయ్యతో) యింకా ఏం తెలియనట్టు నాటకం ఆడతన్నాడురా!

వెంక : (సొమ్మును చూపిస్తూ) యీ సొమ్మంతా ఎత్తుకొచ్చింది నువ్వుగాకపోతే నీ బాబెవడు?

సీతా : హరిభగవాన్! ఎమిటీనీ మాయ!

సుబ్బ : కొంగజపం చేత్తన్నాడురా యింకానూ!

వెంక : (గద్దిస్తూ) నిజంచెప్పు! ఆసొత్తుఎత్తుకొచ్చింది నువ్వా కాదా?

సీతా : నాకు ఏపాపవుణ్యం తెలియదు.

వెంక : (కళ్ళెర్ర జేసి) తెలియదూ! నీసేత యిప్పుడే నిజంచెప్పిస్తాను. వుండు. (కఱ్ఱపైకెత్తి బలంకొద్దీ సీతారాం బుర్రమీద కొడతాడు. సీతారాం తలనుంచి రక్తం చిమ్ముతుంది. "హాయిరాం" అని కెవ్వునఅరచి నేలకొరిగిపోతాడు సీతారాం)

సుబ్బ : ఇప్పుడైనా నిజం ఒప్పుకుంటావా?

సీతా : (నీరసంగా కళ్లుతెరచి దేవుని విగ్రహం దగ్గరకు పాకి వెడతాడు. ముఖం రక్తంతో తడిసి వుంటుంది.) భగవాన్! జీవితకాలం నిన్నే నమ్మికొలిచినందుకు యిదా ఫలితం.

వెంక : (గద్దిస్తూ) ఏమ్! కట్టిపెట్టు నీనాటకం! (రెక్క పట్టుకొని లేవదీస్తాడు)

సుబ్బ : (వెంకయ్యతో) అలాకళ్ళప్పగించి సూస్తా వేంరా! యీపగ్గంతో రెక్కలిరిసి కట్టెయ్యరా! (యిద్దరూ కలిసి సీతారాం చేతులు తాడుతో వెనుకకు విరిచికడతారు. సుబ్బయ్యసొత్తును తిరిగి మూటకట్టి చేత్తో పట్టుకుంటాడు. వెంకయ్య సీతారాంను కదలకుండాపట్టుకుంటాడు)

వెంక : పదరా! బాబుగారి దగ్గరికి తీసుకు పోదాం. యియ్యేళ పెద్దదొంగతనం పట్టేసినందుకు మనకు బహుమతులు దొరుకుతాయి. (యిద్దరూ చెరోవైపున నడుస్తూ సీతారాంను తీసుకుపోతూ వుంటారు. అదేసమయంలోఎడమ వైపునుంచి గౌరీపతి, రాధ ప్రవేశిస్తారు. యీ దృశ్యాన్ని చూసి యిద్దరూ చకితులౌతారు)

రాధ : (సీతారాంనుకౌగలించుకొని) ఏమిటన్నయ్యా యిదంతా? దేవుడిలాంటి నిన్ను బుర్రి బద్దలు కొట్టడానికి ఏదురాత్మార్గులకు చేతులాడినై! (పైటచెంగుతో అతనిముఖం మీద కారుతున్న రక్తాన్నితుడుస్తుంది. సీతారాంధ్యానంలో మునిగి మౌనంగా వున్నాడు.)

గౌరీ : (నౌకర్లనిద్దరిన్నీచూసి కోపంతో) మా అన్నయ్యను యిలా దండించడానికి కారణం?

సుబ్బ : సొత్తు ఎత్తుకుపోతూవుంటే తన్నకుండాముద్దెట్టుకుంటామంటండీ!"

గౌరి : ఎవరిసొత్తు?

వెంక : కామరాజుగారింట్లోవండీ!

రాధ : కామరాజుగారింట్లో మాఅన్నయ్య దొంగ తనంచేశాడా? అబద్ధం! యీరోజంతా దేవుడి సమక్షంలో వుపవాసంతో వున్నాడు మాఅన్నయ్య. నేను వచ్చి కామ రాజుగారితో చెబుతాను. మాఅన్నయ్యను వదిలిపెట్టిపెళ్లండి.

సుబ్బ : అదేం లాభంలేదమ్మోయ్ రాధమ్మగారూ! మేం దొంగను తీసుకెళ్ళకుండా వుట్టిసేతులతో యెళ్ళం. కావాలంటే మీరు తరవాత వచ్చి సెప్పుకోండి. మీరు సెప్తే కాదనరు.

వెంక : యింకా కబుర్లు సెబుతున్నావ్ పదరా సుబ్బయ్యా!

[సుబ్బయ్య వెంకయ్యలిద్దరూ సీతారాంను నడిపించు కొని తొందరగా ఎడమవైపుగా నిష్క్రమిస్తారు. గౌరీపతి రాధ ఆశ్చర్యంతో నిశ్చేష్టులై చూస్తూనుంచుంటారు.]

రాధ : ఇదేం అన్యాయం? సాధువులాంటి అన్న య్యపై నేరం ఆరోపించి తీసుకుపోతున్నారు!

గౌరి : (తేరుకొని) ఈలోకంలో న్యాయాన్యాయ విచక్షణ నశించిందిచెల్లీ! కళ్ళుమూసుకొని ఒక మూలను కూర్చున్నవాడినికూడా రొంపిలోకి లాగుతుందీలోకం. గంగి గోవులాంటి అన్నయ్యను రెక్కలు విరిచికట్టి తీసుకుపోతు న్నారు అన్నయ్యకు రేపు న్యాయస్థానం శిక్ష విధించినా

మనం ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. (ఉద్రేకంతో) ఇక ఫూరుకుంటే లాభం లేదు. అన్నయ్యను క్షణంలో విడి పించుకువస్తాను. యీ అన్యాయాన్ని చూస్తూ సహించి వూరు కోలేను. అవసరమైతే అడ్డువచ్చిన వాళ్ళ అంతం కనుక్కుం టాను! తిరిగివస్తే అన్నయ్యతో కలిసే యింటికి తిరిగివస్తాను లేదా అన్నయ్యతో కలిసి నేనుకూడా జైలుకు వెడతాను. ఇక నామాటకు అడ్డుచెప్పకు నువ్వు యింటికిపో! (తొందరగా ఎడమవైపు నిష్క్రమిస్తాడు. "అన్నయ్యా!" "అన్నయ్యా!" అనిఎలుగెత్తి పిలుస్తూ రాధ అతనివెనుక తొందరగానిష్క్ర మిస్తుంది. —కుడివైపునుంచి నెమ్మదిగా మల్లయ్య, ఎల్లయ్య తిరిగి ప్రవేశిస్తారు.)

మల్ల : యిదేంటిరా ఎల్లయ్యా యిలా మారింది యెవ్వారం?

ఎల్ల : ఆయెదవలిద్దరూ సొత్తు పట్టుకుపోయిందికాక ఏపాపంపుణ్యం ఎరుగని ఆకుర్రోణ్ణి లాక్కుపోయేరేరా?

మల్ల : ఆపిల్లలుముగ్గురూ చచ్చిపోయిన నర్సింగారి పిల్లలుకాదంట్రా?

ఎల్ల : ఆల్లేరా! ఆబాబు ఎంతమంచోడు! సచ్చిపేలో కొన్నన్నాడో కాని మనల్ని ఎంత బాగాసూసేవోడురా?

మల్ల : (జాలిగా) నర్సింగారి పిల్లలు యిలా కష్టపడు తూవుంటే సూత్తావూరుకోలేనురా. ఇప్పుడుమనంవూరుకుంటే ఆకుర్రోడికి జైలేసేస్తారురా!

ఎల్ల : ఇంకమనం ఏం సెయ్యగలంరా?

మల్ల : మనంఏదోఒకటిసేసి ఆఅబ్బాయిని తప్పించాలిరా! లేకపోతే మనంపాపంలో పడిపోతాం. (ఒకక్షణం ఆలోచించి) యింకఆల్సింసేస్తే లాభంలేదురా. నేనెళ్ళిపోయి దొంగతనం వొప్పేసుకుంటాను. నువ్వు యింటికెళ్ళిపో.

ఎల్ల : ఒరేయి మల్లయ్యా నువ్వు నేను పడతన్న కష్టాలు సూడలేక నాకోసం దొంగతనానికి వచ్చేవు. నిన్ను జైలుకుపంపించడం నాకు యిష్టంలేదురా. నేనే యెళ్లిపోయి నేరంఒప్పేసుకుంటాను.

మల్ల : పెళ్లాంపిల్లలుగలవోడువు నువ్వు జైలుకెళ్ళొద్దురా॥ అందులోనూ నీపెళ్లాం రోగిష్టిది. యిలాంటప్పుడు నువ్వు యిల్లొదిలిపెట్టిపోకూడదు. కబుర్లుసాలించి తిన్నగా యింటికిపో. నేనురెండేళ్ళో రెండురోజుల్లాగా జైల్లోగడిపేసి వొస్తాను. నాకోసంపడిసీవోళ్లుకూడా యీ ప్రపంచకంలోలేరు

ఎల్ల : (మల్లయ్యను కౌగలించుకొని భోరునపడుస్తు) ఒరేయి మల్లయ్యా! నీరుణం ఎలా తీర్చుకుంటానురా?

మల్ల : (ఓదార్చుతూ) మనలో మనం సాయపడకపోతే మనుషులమైపుట్టి ఏంలాబంరా? ఇంక ఎల్లిపోరా.

[ఎల్లయ్య వెళ్ల లేక. వెళ్ల లేకఎడమవైపువెల్లిపోతాడు. మల్లయ్య దేవుడిముందు మోకాళ్లమీదనిలబడినమస్కారం పెడుతూ వుంటాడు.—ఎడమవైపునుంచి కామరాజు, రాధ గౌరీపతి, సీతారాంను తీసుకొని సుబ్బయ్య వెంకయ్య ప్రవేశిస్తారు.]

సుబ్బ : యిక్కడకూచుని యీ బాబు మాటయిప్పు తుంటే నేం కళ్ళారా సూశాంబాబూ!

వెంక : ఏం అనుమానం లేదుబాబూ! సొత్తుపట్టుకు పోయింది యీాయనే!

రాధ : లేదండీ! యీారోజు ఉదయంనుంచీ కాలు కదపకుండా మాఅన్నయ్య యీదేవాలయంలోనే కూర్చు న్నాడండి.

గౌరి : మాఅన్నయ్యకు యీదొంగతనంతో ఎంత మాత్రం సంబంధంలేదు,

కామ : (సీతారాంనుద్దేశించి) మీారేం చెబుతారు?

సీతా : అంతాభగవంతునిమాయ! నాకేం తెలియదు నేనుకళ్ళు తెరచి చూసేసరికి తిన్నగా మూట కనిపించింది.

కామ : (హేళనగా) అయితేఆమూటను మీాముందు దేవుడు తీసుకువచ్చి పెట్టేడంటారు.

[యింతసేపటినుంచీయీప్రసంగాన్నిశ్రద్ధతోవింటున్న మల్లయ్య ముందుకువస్తాడు. అందరూ అతనికేసి చూస్తారు]

మల్ల : (గంభీరస్వరంతో) ఆమూటని ఆయనముందు పెట్టింది భగవంతుడుకాదు—నేనేపెట్టేను.

సుబ్బ : (సంశయిస్తూ) యీడెవడికో కూలిచ్చినేరం వొప్పిస్తున్నట్టున్నారుబాబూ!

మల్ల ; (కోపంతోసుబ్బయ్యమెడపట్టుకొని) ఒరేయ్ నీలాడబ్బున్నవోళ్ళయింటిముందు కూలికోసం కాపలాకుక్క

పనిసెయ్యడం లేదురా! నేను!(ముందుకునెట్టుతాడు. సుబ్బయ్య వెళ్ళి వెంకయ్యమీదపడతాడు. సుబ్బయ్య, వెంకయ్యకోపం దిగమింగుకుంటూ బెదురుచూపులతో మల్లయ్యను చూస్తా వుంటారు.)

కామ : (మల్లయ్యతో) నువ్వు దొంగిలించినట్టు మాకు రుజువేమిటి?

మల్ల : కావలసినన్ని ఆనవాళ్ళు సెబుతాను. జాగర్తగా యినండి బాబుగారూ! ఇయ్యేళరాత్రి పదకొండుగంటలకి మీరు మీయింటికివచ్చేరు. అప్పుడు మేం యిద్దరం (తప్పుదిద్దుకుంటూ) అప్పుడు నేను సెట్టైనకాల నక్కేను. మీరు సెడుతిరుగుళ్ళు తిరుగుతున్నారని మీపిల్లల్ని కూడా సూడ్డంలేదని అమ్మగారు మీమీద కోప్పడ్డారు. యిదినిజం అనిఒప్పుకుంటారా?

రాధ : (ఆశ్చర్యంతో) మీకు పెళ్ళయ్యిందా. కామరాజుగారూ?

మల్ల : పెళ్ళేంటమ్మా! ముత్యాలలాంటి పిల్లలు కూడా యిద్దరుంటేను! నేను ఆగదిలో మూటకట్టుకునేప్పుడే ఆపిల్లలు కెవ్వుమన్నారు. అందుకే పారిపోయి రావలిసొచ్చింది.

రాధ : (కోపంతో) ఎంతమోసంచెయ్యడానికిపూనుకున్నారు కామరాజుగారూ! అసలు పెళ్ళేకాలేదన్నారు. నన్ను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నా నన్నారు.

అదంతా అబద్ధమేనా? నేను పూర్తిగా మోసపోనందుకు సంతోషిస్తున్నాను.

కామ : (కోపంతో సుబ్బయ్యను, వెంకయ్యనుచూసి) అలాగడకర్రలలా నిలబడి చూస్తారేంరా? అతన్ని విడిచి పెట్టి (మల్లయ్యను చూపిస్తు) యీ వెధవనికట్టెయ్యండి.

[వెంటనే సుబ్బయ్య. వెంకయ్య సీతారాంను విడిచి పెట్టి మల్లయ్యచేతులువిరిచికట్టేశారు. మల్లయ్యను నొకర్లు తీసుకుపోతూవుంటే వెనుక కామరాజు వెడుతూ వుంటాడు)

రాధ : (ఏదోస్ఫురణకు వచ్చినట్లు) కామరాజుగారూ

కామ : (ఆగి) ఏం? ఎందుకు?

రాధ ; చూడండి కామరాజుగారూ! యీ దొంగ హృదయపరివర్తన కలిగి నేరాన్ని స్వయంగాఒప్పుకున్నాడు మీసొత్తు మీకు దొరికిందికూడా. కనుక యితనిని యీ సారికి క్షమించి విడిచిపెట్టమని మిమ్మల్ని కోరుతున్నాను.

కామ : నీమాటను తిరస్కరించవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను రాధా:—దొంగతనం చట్టరీత్యా ఘోర మైన నేరం. ఈదొంగ తననేరానికి తగినశిక్ష అనుభవించి తీరాలి. నేను దొంగతనాలను ప్రోత్సహించ దలచుకోలేదు. (నౌకర్లతో) పీణ్ణి తాళ్ళతో గట్టిగా బిగించండి. పదండి!

[సుబ్బయ్య, వెంకయ్యచెరోవైపునడుస్తుమల్లయ్యను తీసుకొని ముందువెడుతూ వుంటారు, ఆ వెనుక కామరాజు

నిష్క్రమిస్తారు. రాధ, గౌరీపతి వాళ్లు వెళ్లిపోతున్న వైపు ఆశ్చర్యంతో చూస్తూ వుంటారు]

సీతా : (దేవుడిముందు చేతులుజోడించి) భగవాన్ 'యేమిటి నీమాయ'

గౌరీ : (కోపంతో) ఇది భగవంతుని మాయ కాదు. ధనవంతునిమాయ!.

[గౌరీపతి, రాధ ఎడమ వైపు నిష్క్రమిస్తూ వుంటారు. సీతారాం దేవునిముందు అరమోడ్పు కళ్లతో నిలుచుని వుంటాడు—]

[తెర]

భారతి—జూన్ 55

# పాత్రలు

1. కళాధర్
2. సుధాకర్
3. శేషు
4. సుభాషిణి
5. మంగయ్య.

1—4—55 తేదీని కాకినాడలో యువకళాసమితి వారు

ప్రదర్శించినప్పటి

# నటవర్గం

| | |
|---|---|
| కళాధర్ :— | సాంబశివరావు |
| సుధాకర్:— | గోపాలరావు |
| శేషు :— | కృష్ణారావు |
| సుభాషిణి:— | భానుమూర్తి |

# ఒకటో దృశ్యము.

(ఒక పెద్దగది. సమయం—ఉదయం 9గంటలు. గదిలో పాతతివాసీ పరచివుంటుంది. ఒకమూలహార్మోనియం, మరో మూల తబలావుంటాయి. గదిమధ్య ఒక టేబిలు మూడు కుర్చీలు–టేబిలుమీదపుస్తకాలువుంటాయి. గదంతా చిందర వందరగా వుంటుంది. ఎడమవైపునుంచి కళాధర్ సుధాకర్ ప్రవేశిస్తారు. ఇద్దరికీ వయస్సు 30 సంవత్సరాల లోపు వుంటుంది. వెవక్కిదువ్వినక్రాపు, లాల్చీ, పరాయి—ఇద్దర్నీ చూడగానే తప్పకుండా నటులై వుంటారనిపిస్తుంది)

కళాధర్: (ప్రేక్షకులవైపుతిరిగి) సభాసదులారా!

సుధాకర్: (ప్రేక్షకులవైపుతిరిగి) మహాశయులారా!

కళా: మరోఐదునిముషాలలో నాటకం ప్రారంభించబోతున్నాం.

సుధా: నాటకం ప్రారంభించబోయేముందు నా సాధకబాధకాలను మీతోమనవిచేసుకోవాలనే ఉద్దేశంలో వచ్చాం.

కళా: నాపేరుకళాధర్!

సుధా: నన్నుసుధాకర్ అంటారు.

కళా: మేం యిద్దరం నాటకకళను ఉద్ధరించాలనే సదాశయంతో సర్వసంగ పరిత్యాగం చేసి మా జీవితాలను నాటకకళకు అంకితం చేశాం!

సుధా: ఆంధ్రదేశంలో నాటకకళ రోజురోజుకు దిగజారిపోతూవుండడం మేం భరించలేకపోతున్నాం.

కళా: అందుకే మేం ఉభయులం శుభోదయానాట్యమండలిని స్థాపించి ప్రజలలో అణగిమణగిఉన్నకళాభిలాషను పైకి తీసుకురావడానికి బ్రహ్మాండమైన ప్రయత్నాలు చేస్తూన్నాం.

సుధా: (కళాధర్ వైపు తిరిగి)ఎలావుందిరా! మనఉపోద్ఘాతం.

కళా: (సుధాకర్ వైపుతిరిగి) అమోఘంగా వుందిరా!

[ఇద్దరూ కుర్చీలలో కూర్చుంటారు]

సుధా: రేపు మననాటకానికి ముందు యీ ఉపోద్ఘాతం చెప్పేమంటే ప్రేక్షకులకు మనఆశయం అర్థమైపోయి ఊరుకుంటుంది.

కళా: ఊరుకుంటేలాభంలేదురాసుధాకర్. మనఉపోద్ఘాతం విన్నవెంటనే ప్రేక్షకులలోంచి కనీసం ఒక ధనవంతుడైనా లేచివచ్చి మన నాటకమండలినిపోషించడానికి పూనుకోవాలి.

సుధా:అయితే ఈఉపోద్ఘాతం యింకొంచెం ఘాటుగా వుండాలిరా.

కళా: ఒరేయ్ సుధాకర్! మనలోమనమాట! కళలు పాడైపోతున్నాయని మనలాంటి దరిద్రులం గోల పెడతాం కాని డబ్బున్నవాడొకడూ గోలపెట్టడేంరా?

సుధా: ఓస్! ఈమాత్రం అర్థం చేసుకో లేవట్రా! డబ్బున్నవాడి దృష్టి ఎప్పుడూ డబ్బుమీదే వుంటుంది. దరిద్రుడి దృష్టి ఎప్పుడూ వూరిమీద వుంటుంది. కళలు ఉద్ధరించినా దేశాన్ని ఉద్ధరించినా ఎప్పటికైనా దరిద్రుడే ఉద్ధరించాలిరా? (సంతోషంతో) ఒరేయ్ కళాధర్! నువ్వు నమ్ముతావో లేదో కాని నేను దరిద్రుడినై పుట్టినందుకు చాలాసంతోషిస్తున్నానురా!

కళా: (కోపంతో) సంతోషించు! సంతోషించు! అద్దె యివ్వనందుకు రేపు యింటాయన బయటకు గెంటేసిన తర్వాత యింకా సంతోషిద్దువుగానిలే!

సుధా: నెలరోజులలో మనం అమోఘమైన నాటకాన్ని ప్రేక్షకుల కందించబోతున్నాం. ఆనాటకానికి వచ్చేనికరాదాయం అంతా శుభోదయా నాట్యమండలి. అప్పులు తీర్చడానికేకదూ!

కళా: మనఆశలన్ని ఒకేనాటకంమీద పెట్టుకొనివుండడం అంత మంచిదికాదురా. ఏఅవాంతరాలనైనా నాటకానికి అనుకున్న డబ్బురాకపోతే ఏంచేస్తావ్?

సుధా; (కోపంతో). అమాంతంగా యీరాత్రి నువ్వు చచ్చిపోతే ఏంచేస్తావ్? వెధవప్రశ్నలూనువ్వూను. ఎప్పుడూ

మనం కొత్త కొత్త కోరికలతో ముందుకు సాగిపోవాలికాని–ప్రతి చిన్నవిషయానికి నిరాశతో కృంగిపోతూవుంటే ఒక క్షణం పనిచెయ్యలేం.

(ఎడమవైపునుంచి శేషువస్తాడు. వయస్సు 20 సంవత్సరాలు. చూడగానే చురుకైన యువకుడని తెలుస్తుంది.)

శేషు: (విచారంతో) మన గాలిమేడలు కూలిపోయాయి గురూ.

కళా: (ఆతృతతో) ఏంజరిగిందిరా శేషూ!

శేషు: ఏం జరగకూడదో అదే జరిగిపోయింది!

సుధా: (విసుగ్గా) అదేదో చప్పునచెప్పి తగులడ్రా!

శేషు: (కూర్చుని) నేనుఉదయం ఏంతోచక కాంచనలతగారియింటికి వెళ్లాను.

కళా: భేష్! దానికేం బాగానేవుంది.

శేషు: (విచారంగా) నేనుఅక్కడకు వెళ్ళకపోయినా బాగుండేదికదా అని విచారిస్తున్నాను.

సుధా: ఏం? కాంచనలతకు వంట్లో సుఃఖువుగాలేదా?

శేషు: కావలసినంత సులువుగావుంది. సులుఫుగా లేకపోయినా మనం బాగుపడిపోయివుండేవాళ్లం. (రహస్యంగా) అవిణ్ణి డబ్బున్న పెద్దమనిషి ఒకడు పోషించడానికి ముందుకు వచ్చాడట.

కళా: దానికేం! శుభం! రానీ!

శేషు: అందుకు ఒకషరతుకూడా వుందట. కాంచన

లత యికముందు నాటకాల్లో వేషాలు వెయ్యకూడదట.

సుధా: కొంపమునిగింది. రేపటిమననాటకానికిహీరో యిన్ లేకపోతే ఎలా?

కళా: కిరాయినటుల్ని నమ్మకూడదురా అని ఎంత చెప్పినా వింటావ్‌నువ్వు!_యిక యిప్పుడు మన నాటకాన్ని ఎలా విజయవంతంగా నడిపిస్తావో నడిపించు.

సుధా; (నిరాశతో) అయితే యిక కాంచనలతకూ మనకూ ఋణం తీరిపోయినట్లేనా?

శేషు: ఇక అంతేగురూ!

సుధా: (విచారంగా) కళకోసం తనజీవితాన్ని అంకితంచేశానని ఆమెచెప్పిన కబుర్లన్నీ మోసమేనా?

కళా: (కోపంతో) శుద్ధమోసం! తన స్వార్థంకోసం మన శుభోదయా నాట్యమండల్ని ఉపయోగించుకొంది. తద్వారా ఒక ధనవంతుణ్ణి సంపాదించి కళకు తిలోదకాలు యిచ్చింది.

సుధా: (కోపంతో) ఒరేయికళాధర్! ఇలాంటి చీడ పురుగుల్ని ఏరిపారెయ్యకపోతే-అసలే పతన దశలో వున్న నాటకకళ మరీపతనమై పోతుందిరా. మనశుభోదయానాట్య మండలిఅంటే కళాకేంద్రం అనుకుందా? లేక నైట్‌క్లబ్ అనుకుందా? ఇప్పుడే కాంచనలత యింటికివెళ్లి అటోయిటో తేల్చుకు వచ్చేస్తాను.

[లేచి ఉద్రేకంతో వెళ్లబోతాడు]

కళా: (సుధాకర్‌ను పట్టుకొని) ఒరేయ్! సుధాకర్! ఆవేశాన్ని కొంచెం తగ్గించుకొని నేనుచెప్పింది విను. జరిగిందేదో జరిగిపోయింది. ఇక కాంచనలత ఆశ విడిచిపెట్టి మన నాటకం దిగ్విజయంగా నడవడానికి ఉపాయం ఏదైనా ఆలోచించు

సుధా: (నిస్పృహతో) ఇక ఉపాయానికేముందిరా కళాధర్! మరోకిరాయినటిని ఎవరినైనా చూసుకోవలసిందే! (శేషుతో) ఒరేయి శేషూ! నీకు రెండురోజులు టైమిచ్చాను. ఈ రెండు రోజులలో మన "సంధ్యారాగం" నాటకంలో "సంధ్య" పాత్ర ధరించడానికి సరిపోయే ఒక కిరాయి నటిని కుదుర్చుకురావాలి.

శేషు: (సంతోషంతో) రెండురోజులుకూడా అక్కర్లేదు గురూ! ఈరాత్రికే తీసుకురాగలను.

కళా: (నిస్పృహతో) మళ్లా కిరాయినటిని కుదుర్చుకోవలసిందేనన్నట్రా సుధాకర్!

సుధా: (నిస్పృహతో) అంతకంటే గత్యంతరం లేదురా కళాధర్!

శేషు: మీరు నిరాశపడకండి గురూ నేను సాయంత్రానికి ఏదోఒకవార్త తీసుకువస్తాను. (ఎడమవైపు వెళ్లిపోతాడు)

సుధా: (శేషుపోతున్నవైపు చూపిస్తూ) ఇలాంటి ఉత్సాహవంతులైన యువకులవల్లె కళ ఏనాటికైనా బాగుపడాలిరా.

కళా: (విసుగ్గా) బాగుపడుతుందిరా బాబూ బాగు పడుతుంది. ఇక మననాటకానికిచూస్తే ఒక నెలరోజులేగడువు వుంది. ఇప్పుడు అమాంతంగా "సంధ్యా" పాత్రధారిణిదగా చేసింది. తీరా ప్రకటన చేసేశాం-యిప్పుడీ నాటకాన్నినిర్విఘ్నంగా కొనసాగించేదెట్లా?

సుధా: నువ్వనవసరంగా బుర్రపాడు చేసుకున్నందుకు ప్రయోజనం లేదురా! చెయ్యవలసిన ప్రయత్నాలుఎలాగూ చేస్తున్నాం.

[ఇద్దరూ మౌనంగా ఆలోచిస్తూ వుంటారు. క్షణం నిశ్శబ్దం. ఎడమవైపునుంచిసుబ్బులు ప్రవేశిస్తుంది. వయస్సు 16 సంవత్సరాలు. జుట్టు సంస్కారం లేకుండా చిందరవందరగా ముఖంమీద పడుతూవుంటుంది. పొట్టి పరికిణీ- ఓణీ - నల్లజాకెట్ వేసుకొని వుంటుంది. ముఖం గుండ్రంగాఉత్సాహంతో తొణికిసలాడుతూవుంటుంది. చూడగానే "పనిపిల్ల" అని తెలుస్తుంది. ఆమె చేతిలో చెంబువుంటుంది.]

సుబ్బులు:-(ఏసగా) బాబుగారూ! పాలుఎక్కడుంచమంటారూ?

సుధా: (విసుగ్గా) ఒకక్షణం ఆగు! మాఆలోచనలకు అంతరాయం కలిగించకు..

(సుబ్బులు బెదురుచూపులతో యిద్దర్నీ చూస్తూవుంటుంది.. సుధాకర్ గెడ్డంకింద చెయ్యిపెట్టుకొనితీవ్రంగాఆలోచిస్తూ వుంటాడు.. కళాధర్ సుబ్బులుకేసి పరిశీలనగా-తీక్షణం

గా చూస్తూ వుంటాడు.)

సుబ్బులు:(కళాధర్ తో)అదేటిబాబుగారూ!ఎప్పుడూ లేంది నాకేసి అలా సూత్తన్నారు?-మాయింటి పక్కనున్న గంగయ్యగోడు కూడా యిలాగే సూత్తుంటే ఓకనాడు మా బాబుతో సెప్పాను. ఎహ్హే! (నవ్వుతుంది)

సుధా: (చిరాగ్గా) దీపంసెమ్మెలాఅలానిలబడే బదులు ఆచెంబు తీసుకువెళ్ళి ఆగదిలో పెట్టకూడదటే!

(సుబ్బులు నవ్వుతూ కుడివైపువెళ్ళి చెంబులోపల వుంచి తిరిగివస్తుంది. కళాధర్ యింకా ఆమెకేసి చూస్తూ ఆమె ప్రతికదలికనూ గమనిస్తూ వుంటాడు.)

కళా; (ఆమె ముఖంలోకి తీక్షణంగా చూస్తూ) సుబ్బులూ' యిలారా! (ఆమె జడుస్తూ దగ్గరకు వస్తుంది. కళాధర్ లేచి నిలబడి) అటుతిరుగు!(సుబ్బులు ప్రేక్షకులవైపు తిరుగుతుంది. అతను ఆమెప్రక్కను నిలబడతాడు) ముఖం ఓరగాపెట్టి కిందకుదించు. (ఆమెముఖంకిందకు దించుతుంది) రెండు చేతుల్నీ నడుంమీద వుంచి యీలా నాట్యభంగిమ తో నిలబడు. (అతను నిలబడి చూపిస్తాడు. ఆమె కూడా అలానిలబడుతుంది)

సుధా: (ఇంతవరకూ ఆశ్చర్యంగా చూస్తూ యిక భరించలేక లేచి) నీకేమైనా మతిపోయిందటరా కళాధర్?

కళా: (సుధాకర్ వైపు ముఖం తిప్పకుండానే చేతితో సంజ్ఞచేస్తూ) ఉష్! (సుబ్బులుతో) ఇక సరిగా నిలబడు. (నిల

బడుతుంది) నీకేమైనా చదువొచ్చునా?

సుబ్బు: ఊఁ! ఊఁ! సిన్నప్పుడు ఒకటో కళాసు పట్టేనండి ఆ పేర్లు యింకా గ్యాపకం వున్నాయి! అల-వల-పిలక-

సుధా: (మధ్యలో అందుకొని) పిలక కాదు పలక!

కళా; (సంతోషంతో) సెహభాష్! నువ్వు యికమా నాటకంలో సంధ్యపాత్రకు సరిగాసరిపోతావ్!

సుధా; నీకు యివేళ కొంచెం బుర్ర చెడిపోయినట్లు కనుపిస్తోందిరా కళాధర్!

కళా; ఏం?

సుధా; లేకపోతే అపస్వరాలు పలికే యీ పిల్లను తీసుకువెళ్లి స్టేజీ ఎక్కిస్తే మన మర్యాద యేమైనా దక్కుతుందిటరా?

కళా: ఒరేయ్ సుధాకర్! నెలరోజులలో యీ సుబ్బులిని గొప్ప హీరోయిన్‌ని చెయ్యలేకపోతే నాపేరు కళాధరే కాదు. ఎంతశ్రమమైనా ఓర్చి యీమెను ఉత్తమ నటిగా తయారుచేస్తే కిరాయి నటీమణులకోసం వెతుక్కోవలసిన బాధ తప్పుతుంది.

సుబ్బు: (ఆశ్చర్యంతో) ఏటిబాబుగారూ! నాటకంలో నన్ను ఏస మేయిస్తారా?

కళా: అవును! నీకు యిష్టమేనా?

సుబ్బు: (ఆనందంతో) ఓ సినీమాలో దేవకన్నెకలాగ మంచి బట్ట లేసుకోవచ్చు. (భయంతో కళ్లు పెద్దవిచేసి)

మాబాబుకు తెలిస్తే వూరుకోడండి!

కళా: మీబాబుతో నేనుమాట్లాడతానులే! (సుధాక ...)ఒకేయ్ సుధాకర్! నేనుఆమోఘమైనకార్యభారాన్ని నెత్తిమీద వేసుకున్నాను. నువ్వీవిషయంలో నాతో సమానంగా శ్రమపడాలి.

సుధా: నువ్వొకటీ నేనొటీ నటరా కళాధర్!

కళా: నువ్వు వేగం వూళ్లోకి వెళ్లి పలక, ఒకపుస్తకం కొన్ని రకాలబట్టలు సుబ్బులుకు సరిపోయేవి తీసుకురావాలి.

సుధా: సరే! అలాగే తీసుకువద్దాం!

కళా: ఇక పేపర్లలో సంధ్యపాత్రకు తిన్నగావున్న కాంచనలత పేరుకొట్టించి 'కుమారి సుభాషిణి' అని రాయించు.

సుధా: (సంతోషంతో) ఈపేరు అమోఘంగా వుంది. (సుబ్బులుతో) యివేళనుంచి నీపేరు సుబ్బులుకాదు సుభాషిణి జ్ఞాపకం వుంచుకో.

సుబ్బు: సుబాసి నేటి బాబుగారూ?

కళా: (ఆమెకేసి తీక్షణంగా చూస్తూ)

'సు-భా-షి-ణి' అను

సుబ్బు: (భయంతో) సుభాషిణి.

కళా: వెళ్లి ఆకుర్చీమీద కూర్చో.

సుబ్బు: (భయంతో) అమ్మబాబోయ్! నే నాకుర్చీ మీద కూకుంటే మాబాబు సంపేస్తాడు.

కళా: (కోపంతో) నిశ్శబ్దంగా ముందు ఆ కుర్చీమీద

కూర్చుంటావా? లేదా? [సుబ్బులు భయంతో కుర్చీమీద కూర్చుంటుంది]

కళా: (పుస్తకం తెరచి) నేను చదివినమాట నువ్వు తిరిగి అటూవుండు. (చదువుతూ) యీ వెన్నెలరాత్రిలో —

సుబ్బు: (జాగ్రత్తగా తిరిగి అంటుంది)యీ వెన్నెల రాత్రిలో—

కళా: (పుస్తకం చూస్తూ యిలా మనం రోజూ కలుసుకుంటూ వుంటే......

సుబ్బు: యిలా మనం... (మరిచిపోతుంది.)

సుధా: యిలా మనం రోజూ

సుబ్బు: యిలా మనం రోజూ

[ఎడమవైపునుంచి శేషు తొందరగా వస్తాడు.]

శేషు: (ఉత్సాహంతో) ఐదునిమిషాలలో మనకు హీరోయిన్ దొరికింది. కాని నాటకానికి రెండువందలరూపాయలు కావాలంటోంది.

కళా: ఒరేయ్ శేషూ! యిక ఆ కిరాయినటులమాట నాదగ్గర ఎత్తకు. (సుధాకర్‌తో)ఒరేయ్ సుధాకర్! మీరిద్దరూ వూళ్ళోకి వెళ్లి నేను చెప్పినవన్నీ తీసుకొని వేగంరండి.

శేషు: (సుబ్బులుకేసి ఆశ్చర్యంగాచూస్తూ) ఏమిటే సుబ్బీ! కుర్చీఎక్కి దర్జాగా కూచున్నావ్?

సుబ్బు: (కోపంతో) ఏమండోయ్ అబ్బాయిగోరూ! నన్ను సుబ్బీ గిబ్బీ అంటే వూరుకోను.

కళా: అబ్బాయిగోరు కాదు—అబ్బాయిగారు అను.

సుబ్బు: అబ్బాయిగారు.

కళా: లోనికివెళ్లి—తోట్టిలో నీళ్ళున్నాయ్—స్నానం చేసి సిద్ధంగావుండు. మొదటిపాఠం యిప్పుడే ప్రారంభిస్తాను.

సుబ్బు: (భయంతో) మరి... మరి... మాబాబు...

కళా: అదంతా నేను చూసుకుంటాను. ముందు నేను చెప్పినపని చెయ్యి.

[సుబ్బులు బెదురుచూపులతో కుడివైపు వెళ్ళిపోతుంది]

శేషు: (యింతవరకూ ఆశ్చర్యంగా చూస్తూ) ఏమిటిదంతా గురూ!

కళా: మనశుభోదయా నాట్యమండలికి సుబ్బుల్ని హీరోయిన్‌గా బుక్ చేశాం.

సుధా: యీకొత్త కథానాయికనురంగంమీదచూడగానే ప్రేక్షకులు హర్షిస్తారో లేకపమైనా వర్షం కురిపిస్తారో!

కళా: ప్రతివిషయాన్ని శంకించడం నీకో జబ్బురా సుధాకర్! ముందుఆత్మవిశ్వాసంతో కార్యరంగంలోకిదూకేద్దాం. మంచిఫలితమే కలుగుతుందో చెడ్డ ఫలితమే కలుగుతుందో నిర్ణయాన్ని భవిష్యత్తుకే విడిచిపెడదాం.

శేషు: సుబ్బులువంటి సంస్కారం లేనిదాన్ని స్టేజి ఎక్కిస్తే నవ్వులపాలవుతామేమోనని భయంగావుందిగురూ! అందులోను యీకాలపు ప్రేక్షకులు చాలా తెలివైనవాళ్ళు నాటకంలోగాని, నాటక నిర్వాహణలోగాని ఏమాత్రంలోపం

ఫునాన్ను వూరుకోరు.

సుధా: అదేశానాయనా! నేనుచెప్పేది కూడా.

కళా: ఒరేయిసుధాకర్! మనం యిద్దరం చిన్నప్పటి నుంచీ స్నేహితులం.

సుధా: ఆమాట వేరేచెప్పాలటరా కళాధర్.

[యిద్దరు జట్టాపట్టాలు వేసుకొని ముందుకు వస్తారు]

కళా: యింతవరకూ ఏ పనిచేసినా మనం యిద్దరం కలిసేచేశాం.

సుధా: ప్రేక్షకులనుంచివచ్చే దూషణ భూషణాలనన్నీ మనం యిద్దరమే పంచుకున్నాం.

కళా: మనం ఎన్నో పట్టణాలలో నాటకాలు ప్రదర్శించాం.

సుధా: రకరకాల ప్రేక్షకుల మనస్తత్వాలనుఆకళింపు చేసుకున్నాం.

కళా: ప్రేక్షకులను ఏవిధంగా రంజింప చెయ్యాలో కనీసం యీనాటికైనా మనం తెలుసుకున్నామని విశ్వసిస్తున్నాను.

సుధా: నేనుకూడా గాఢంగా విశ్వసిస్తున్నాను.

కళా: (దూరంగానిలబడికోపంతో) కాబట్టి - యిక అధిక ప్రసంగం కట్టిపెట్టి-యీవిషయంలో నువ్వునాతోపాటు కార్యరంగంలోకి దూకెయ్యి.

సుధా: నువ్వు యింతదూరం చెప్పాలటరా కళాధర్!

మనం యిద్దరం కలిసి సుబ్బులిని నెలరోజులలో హీరోయిన్‌గా మార్చేద్దాం. సరా!

[కళాధర్ వైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు]

కళా: అంతేకాదు. రెండు నెలలలో నాట్యరాణిగా మార్చేద్దాం. మరో ఆరు నెలలకు అద్వితీయమైన నటీమణిగా తయారుచేద్దాం.

శేషు: నిజమే గురూ! యింతవరకూ మనరంగస్థలానికి ఉత్తమనటులున్నారు కాని ఉత్తమనటీమణులున్నట్లు కనిపించరు.

సుధా: (నిస్పృహతో) లేకపోలేదు – వున్నారురా నాయనా వున్నారు!

కళా: (నిస్పృహతో) వాళ్ళంతా శృంఖలాలలో చిక్కుకుపోయి వున్నారురా నాయనా!

శేషు: మనంయిప్పుడు చెయ్యవలసినపనేమిటో మీరు చెప్పడంలేదు.

సుభా: (తెరలోంచి గట్టిగా) బాబుగారు!

కళా: వస్తున్నాను. (ఒక్కసారిగా) యిప్పుడు అన్ని విషయాలూ చెప్పుకొనడానికిసావకాశంలేదు. మీరుయిద్దరూ తక్షణం ఊళ్ళోకి వెళ్ళిరండి. నేనుయీలోపున సుబ్బులుకి తొలిపాఠం ప్రారంభిస్తాను.

[కళాధర్ కుడివైపు–సుధాకర్, శేషు ఎడమవైపు నిష్క్రమిస్తారు– తెర]

# రెండో దృశ్యం.

(నెలరోజులు గడిచిన తరవాత—అదేగది— రాత్రి 8 గంటలు. తెరఎత్తగానే గదిఖాళీగా కనిపిస్తుంది. ఈ సారి గది శుభ్రంగా సర్దినట్లు వుంటుంది. గదికి ఎడమ వైపున టేబిలూ, నాలుగుకుర్చీలు వుంటాయి. మిగిలిన గదంతా ఖాళీగా వుంటుంది. టేబిలుమీద పుస్తకాలు సర్దివుంటాయి. ఎడమవైపునుంచి కళాధర్ సుధాకర్ ఉత్సాహంతో మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు]

సుధా: సంధ్యారాగం నాటకంతో మనకీర్తి తారాపథాన్ని అంటుకుపోయింది. నాటకం ఆడుతున్నంతసేపు ప్రేక్షకులు హర్షధ్వానాలు చేస్తూనేవున్నారు.

కళా: ప్రజలసమస్యలను చిత్రించే నాటకం ప్రజలను ఆకర్షించకేంచేస్తుందిరాసుధాకర్. యీమధ్య నేనొక రహస్యం కనిపెట్టాను.

సుధా: (ఆశ్చర్యంతో) నేను కనిపెట్టలేని రహస్యం నువ్వెలా కనిపెట్టేశావురా?

కళా: సరిగ్గా అక్కడేవుందిరా నీకూనాకూవున్న తేడా అంతా! నీకుఆవేశం ఎక్కువ. ఆలోచనతక్కువ.

సుధా: (కోపంతో) నీ తెలివికి సంతోషించాం గాని ఆ రహస్యం ఏదో వేగం చెప్పితగులడు.

కళా: నాటకకళకు సినిమాకళకు కలిగినపోటీలో నాట

కాలు ఓడిపోయాయని యింతవరకూ అందరూ అనుకుంటూ వచ్చారు.

సుధా: మనంకూడా అనుకున్నాం.

కళా: ఆఅభిప్రాయం శుద్ధతప్పని నిన్నరాత్రి జరిగిన మననాటకం ఋజువుచేసింది.

సుధా: అదేదో వివరంగా చెప్పమనే నేనిప్పుడడిగేది

కళా: లక్షలకొద్దీ విలువైన సెట్టింగులు, సౌండు మొదలైన అమోఘమైన సాధనాలు ఎన్నో వున్నప్పటికీ కొన్ని సినిమాలు రాణించలేకపోతున్నాయ్. మనంచూడు కేవలం ఐదుగురు పాత్రధారులతో నాలుగురకాల సంగీత సాధనాలతో ప్రేక్షకులను పురూరూతలూగించాం.

సుధా: (చిరాగ్గా) యింతకూ నువ్వనేది ఏమిటి?

కళా: అదే! అసలువిషయం చెబుతున్నాను. జాగ్రత్తగావిను. యింతకాలంవరకూ నాటకకళ నివురుగప్పిననిప్పులా కాంతివిహీనంగా వుంది, మనలాంటివాళ్ళం కొందరం పూనుకుంటే మన దేశంలోని రంగస్థలం కొన్నినెలలలో పాశ్చాత్య దేశాలను మించిపోతుంది.

సుధా; ఏదిఏమైనా—రాత్రి ఆడిననాటకంతో అమాంతంగా మనతార మారిపోయింది. ప్రేక్షకులంతా 'కుమారి సుభాషిణి' ఎవరాఅని ఆశ్చర్యపోయారు. ఆమె అందాన్ని, తీవినీ చూసి హాల్లోవున్న యువకులంతా ఎవరికుర్చీలలో వాళ్లు మూర్ఛపోయారనుకో!

కళా; (సగర్వంగా) ఆంధ్ర రంగస్థలానికి అద్భుతమైన కథానాయకిని సృష్టించి యిచ్చిననాకు ఆంధ్రదేశం ఏం ప్రతిఫలం యిస్తుందిరా?

(సరిగా ఈమాట అనేసమయంలో కుడివైపునుంచి సుభాషిణి తొందరగా వస్తుంది. మొదటిదృశ్యంలో కనుపించిన సుబ్బులుకు యీసుభాషినికి ఎంతో తేడా కనుపిస్తుంది. రెండు జడలు–ముఖం అందంగావుంటుంది. పెదవులకు లిప్ స్టిక్ ఎరుపు—జార్జిట్ చీర—జోడు–స్వచ్ఛమైన శబ్దోచ్చారణ)

సుభా: ఎంతసేపయింది మీరువచ్చి?– మీకోసం గంటనుంచి వెతుకున్నాను. (విసుగ్గా) అబ్బబ్బా! యిక యిక్కడ నేను వుండలేనేమో అనిపిస్తోంది.

కళా: ఏం? యిప్పుడేం కొంపమునిగింది?

సుభా: ఆ శేషు చూడండి! యింకానన్ను 'సుబ్బులు' "సుబ్బులు" అని పిలుస్తున్నాడు!

సుధా: (నవ్వుతూ) ఒహో! అదా కథ! యిక అలా అనవద్దని చెబుతాలే

సుభా: అంతేకాదు నన్నొక క్షణమైనా చదువుకోనివ్వడు. పుస్తకం తెరిచేసమయానికి దగ్గరకువచ్చి ఏదో 'ప్రేమ' "ప్రణయం" అటాడు. (విసుగ్గా) అతనితో నాకు చాలా గొడవగా వుందండి!

కళా: (కోపంతో) హరి! వీడిముఖం తగలెయ్యా! మనం యిప్పటికి ఒకదారికి వచ్చామని అనుకుంటూ వుంటే వీడికి ప్రేమ వెర్రిపట్టిందా?

సుధా: ఒరేయ్ కళాధర్! ఈచిక్కంతా ఎందుకు వచ్చిందంటే–మనం సుభాషిణికి పుస్తకాలు చదవడం–నటించడం నేర్పడమేకాని – ప్రణయంగురించి కనీసం ఒక పాఠమైనా చెప్పలేదురా!

కళా: జీవితాన్నంతా కళకేఅంకితంచేసి పెళ్లాంపిల్లలు లేకుండా– బైరాగాశ్రమంలోవున్న మనం (నిస్పృహతో) ప్రణయంగురించి ఏం చెప్పగలంరా సుధాకర్!

సుధా: నీమాట నిజంరా కళాధర్! (సుభాషిణితో) ఇదిగో! అమ్మాయ్! సుభాషిణీ! మేం ఖచ్చితమైన బ్రహ్మచారులం. నాటకాలలో చదివిన కొద్దిమాటలు మినహా మాకు ప్రణయంగురించి ఏమీ తెలియదు. కనక యిక యీ విషయంమీలో మీరే పరిష్కరించుకోవటం మంచిది.

కళా: (కోపంతో) ఏడిసినట్టేవుంది నీతీర్పు. (సుభాషిణితో) అమ్మాయ్! ఇది పవిత్రమైన కళానిలయం. ప్రేమతో యీ పవిత్రమైన స్థలాన్ని కలుషితం చెయ్యడం మేం అంగీకరించం. కనక నువ్వువెళ్లి ఆశేషుగాణ్ణి యిలా పంపు. చెవి మెలేస్తాను.

[సుభాషిణి నవ్వుతూ కుడివైపు వెళ్లిపోతుంది]

సుధా: (సుభాషిణివెళ్లేవైపు చూస్తూ) ఇదివరకు చూడ్డానికే అసహ్యంగా వుండే యీపిల్ల యింత అందంగా ఆకర్షణీయంగా ఎలా మారిందా! అని నాకే ఆశ్చర్యంగా వుందిరా..

కళా: చదువు సంస్కారం, అందం, ఆకర్షణా యివన్నీ డబ్బున్నవాళ్లు గుత్తకు కొనేశారురా! ఈ దేశంలో దరిద్రం వల్ల ఎంతో ఉపజ్ఞకలవాళ్ళు కూడా రాణించలేక పోతున్నారంటే నమ్ము! ఉదహారణకు సుబ్బుల్ని చూడు! దానిలో నటికి కావలసిన సహజలక్షణాలు ఎన్నో వున్నా దారిద్ర్యం వల్ల రాణించలేకపోయింది. ఆమెసౌందర్యంకూడాదరిద్రంలో అణిగిపోయి వుంది. ఆమెకు మనం కొంతచేయూత యివ్వగానే ఎంతగొప్పగా తయారయ్యిందో చూడు. యీ దేశంలో దరిద్రంవల్ల యింకా ఎంతమంది సుభాషిణిలు అణిగిపోన్నారో ఆలోచించు!

సుధా: (నిరాశతో) ఇక యిప్పటిలో యీ దేశానికి మంచిరోజులు వస్తాయనుకోనురా కళాధర్!

కళా: ఏం మంచిరోజులురా వెర్రినాయనా! ఈ దేశం లోరచయితకు అరకప్పు కాఫీకి దిక్కులేదు. చిత్రకారుడికి రంగులు కొనుక్కోడానికి శక్తిలేదు. నటుడికి నాటకం ఆడటానికి డబ్బులేదు. -ఎవరినైనా ముష్టెత్తి నాటకం ఆడదామన్నా, చివరకునాటకం ఆడ్డానికి పనికివచ్చే థియేటరయినా లేదు.—ఏ ఇంగ్లండు దేశంలోనైనా పుట్టక యీ దేశం ఎందుకు పుట్టేనురా అని నేను విచారించని రోజులేదురా సుధాకర్.

సుధా: అందుకేరా యీ దేశాన్ని ఖర్మభూమిఅన్నారు

కళా: (సీరియస్‌గా) ఒరేయ్! ఇకమనం కబుర్లు కట్టి

పెట్టి కార్యరంగంలోకి అమాంతంగా దూకెయ్యాలి. అప్పుడే చాలా టైం అయిపోయింది.

సుధా: సాంబారు మెతుకులు పడిన తర్వాత మత్తు మరీఎక్కువై పోయిందిరా! కొంచెం టీ పడితేగాని బండిచురుగ్గానడిచేట్లు లేదు.

కళా: అయితే పద! రెండుకప్పులు టీ తాగివద్దాం. ఇప్పుడే చెబుతున్నాను ఈరాత్రి ఒకనిమిషం కూడా వృధాగా పోకూడదు.

(ఇద్దరూ ఎడమవైపు వెళ్లిపోతారు. కుడివైపునుంచి సుభాషిణి వెనక వేపు మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.)

శేషు: (సంభాషణ కొనసాగిస్తూ) అందుకే ప్రతిచిన్న విషయానికి నేను మాగురుదేవుల్ని ఆదర్శంగా తీసుకుంటూ వుంటాను. ఇద్దరూ జీవితాన్నంతయుకళకే అంకితంచేసేశారు ఉదయం లేచింది మొదలు రాత్రిపడుకునేవరకూ యిద్దరూ కళగురించే తర్కిస్తూవుంటారు. చివరకు నిద్రలో కూడా నాటకాల్ని గురించి కలవరిస్తూవుంటారు.

సుభా: నువ్వుకూడా మీగురువుగార్లలా కళగురించే ఆలోచిస్తూ కూర్చోకూడదూ? ప్రేమంటూ వెందుకు?

శేషు: అక్కడే వుంది తేడా అంతా! మా గురువులిద్దరూ పాత బ్రహ్మచారులు. వాళ్ళు బ్రహ్మచర్యానికి పూర్తిగా అలవాటు పడిపోయారు. కొత్త బ్రహ్మచారిని. నన్నుకూడా అలావుండమంటే నాతరమా? నాజీవితాశయం నీకీవేళ చెప్పే

స్తాను సుబ్బులూ!

సుభా: (కోపంతో) ఏయ్ సుబ్బులని పిలవద్దని చెప్పాం దినీకు కాదూ! సుభాషిణి అనిపిలు! లేదా 'సుభా' అని పిలు! తెలిసిందా?

శేషు: పొరబాటు! ఎక్కువ అలవాటు వల్ల అటు వంటి పొరబాటు దొర్లుతూవుంటుంది- చూడు సుభా! నా జీవితాశయం ఏమిటంటే నేను ఒక నటీమణినివివాహంచేసు కొని జీవితాంతం నాటక కళకోసం పాటుపడాలని - ఇంతకా లం నాలో అణిగివున్న యీఆశయం నిన్ను చూడగానే-ఫ్రా యిడ్ సిద్ధాంతాన్ననుసరించి - అమాంతంగా విజృంభించింది- అప్పుడే చాలా టైమయిపోయింది. వేగంభోజనంచేసి వచ్చి రిహార్సల్సుకు హాజకావాలి: వస్తాను!

(ఎడమవైపు వెళ్లిపోతాడు. సుభాషిణి పుస్తకం చదు వుతూవుంటుంది. రెండు నిమిషాలు నిశ్శబ్దం-ఎడమవైపునుంచి కళాధర్, సుధాకర్ కేకలు వేసుకుంటూ ప్రవేశిస్తారు. ఇద్దరి ముఖాలు చాలాసీరియస్‌గా వుంటాయి. సుభాషిణి యిద్దర కేసి ఆశ్చర్యంతో చూస్తూవుంటుంది.)

కళా; (కోపంతో గట్టిగా) నువ్వొకుగాన్మొగాడవు! దగా కోరువు! నీవల్ల సమాజానికి కలిగే హాని వర్ణించడానికి వీల్లేనిది.

(కుడివైపుచివరకు వెళ్లి నిలబడతాడు)

సుధా: (ఎడమ చివరనిలబడి) నే నేంచేశాను?

కళా: (కోపంతో కళ్ళు ఎర్రచేసి) ఇంత కాలంనుంచీ నువ్వెంతో మంచివాడవనుకుంటున్నాను. నువ్వు ప్రపంచాన్ని మోసంచేస్తున్నావు. ధనవంతురాలుకదా అని ఆశించి విమలను నీవలలో వేసుకున్నావు. నువ్వు పుట్టుకతో దరిద్రుడవైనా ధనవంతుడిలా నటిస్తున్నావ్. సన్మార్గాన్ని విడిచిపెట్టి దుర్మార్గాన్ని వరించేవ్!

సుధా: (గంభీరంగా) నేనుదుర్మార్గుణ్ణే గామారేనంటే అది నాతప్పుకాదు. నన్నుఆలా మార్చినసమాజానిది ఆతప్పు! (ఉద్రేకంతో) నేను తిండిలేక కడుపుచేత్తో పట్టుకొని దేశమంతా తిరిగేను. నన్నుచూసి జాలిపడినవాళ్ళయినా నాకు కనుపించలేదు. చివరకునౌకరుద్యోగమయినా యివ్వమని ప్రాధేయపడి అడిగాను, కాని నాకీ దేశంనౌకరు ఉద్యోగానైనా యివ్వలేకపోయింది. (కోపంతో) చివరకు నాలోవున్న కొద్ది తెలివీ వినియోగించి దేశానికి ఎదురుతిరిగేను.

కళా: కష్టాలకు లొంగిపోతే యిక నీవిలువ యేముంది? జీవితపు పోరాటంలో ఎటువంటి ఘర్షణలైనా ఎదుర్కొని సక్రమ మార్గాన్ని నడవగలగాలి. అదే సన్మార్గుల లక్షణం?

సుధా: (ఇంతవరకూ ఆశ్చర్యంతో యిద్దరివైపూ చూస్తూ యిక భరించలేక హాలుకు మధ్య— అంటే కళాధర్ సుధాకర్ లకు మధ్య —నిలబడి) ఇంతవరకూనవ్వుతూ మాట్లాడుకున్నారు ఇంతలోనే మీాకు పేచీపలావచ్చింది?

సుధా: (సుభాషిణి మాట వినిపించుకోకుండా) ఏమైె

నా నాపతనానికి కారణమైన యీసమాజంపై ప్రతీకారం తీసుకొనితీరతాను.

సుభా: (సుధాకర్ దగ్గరకు వెళ్ళి) ఊరుకోండి!

కళా: (కోపంగా సుధాకర్‌తో) నువ్వు బాల్యస్నేహితుడవు కదా అని యింతసేపూ మంచిగా చెప్పవలసివచ్చింది (ముందుకు రెండడుగులు వేస్తాడు.)

సుభా: (కళాధర్ దగ్గరకువెళ్ళి) మీారైనాఊరుకోండి

సుధా: (కోపంతో రెండడుగులు ముందుకువచ్చి)నువ్వు నీమర్యాదను కాపాడుకోవలసిన అవసరం ఎంతైనావుంది.

సుభా: (భయంతో), హమ్మయ్యో! మీారిద్దరూ కొట్టుకునేలా వున్నారు. నాకుభయంగా వుంది కేకలువేసి అందర్ని పిలుస్తాను.

కళా: (మామూలుగా) భయపడకు సుభాషిణీ! మేం రేపటి కొత్తనాటకానికి రిహార్సల్సు వేసుకుంటూన్నాం..

సుభా: (గుండెమీాద చెయ్యివేసుకొని) అబ్బ నాగుండె లింకా కొట్టుకొంటున్నై ఎంతభయంపెట్టేరు!

సుధా: (ఎప్పటిలా) ఒరేయ్ కళాధర్! మననటనలో సహజత్వంవుంది. లేకపోతే సుభాషిణి యింతభయపడి వుండేదికాదు. [ముగ్గురూ తాయపీగా కుర్చీలోకూర్చుంటారు.]

కళా: మనకు సినీమా నటులకు వున్న తేడా అదేరా! మననటనలో వున్న సహజత్వం వాళ్ళకు చస్తే రాదు. ప్రేక్షకులలో ఉద్రేకం కలిగించినా ఆనందంకలిగించినా మనమే

కలిగించాలిరా.

ఎడమవైపునుంచి మంగయ్య ప్రవేశిస్తాడు. వయస్సు 25 సంవత్సరాలు, విలువైన సూటు—వేళ్ళకు ఉంగరాలు—రిస్టు వాచీ గొలుసు—చూడగానే ధనవంతుడని తెలుస్తుంది. అతన్ని చూడగానే శేఖర్ సుధాకర్ — యిద్దరూ లేచి ఆహ్వానిస్తారు. సుభాషిణి ఠీవిగా కూర్చునిఉంటుంది]

సుధా: హల్లో! మంగయ్యగారు! ఏమిటిలావచ్చారు? రండి! రండి! కూర్చోండి.

శేఖ: (కుర్చీ అటులాగి) కూర్చోండి. (సుభాషిణితో) వీరు దివాన్ బహద్దర్ రంగయ్యగారి అబ్బాయి మంగయ్యగారు. (మంగయ్యతో) ఈ మెమూశుభోదయానాట్యమండలి పెర్మనెంటు హీరోయిన్ కుమారి సుభాషిణి.

సుభా: (లేచి మంగయ్యకేసి తిరిగి) నమస్కారం! (కూర్చుంటుంది)

మంగ: (సుభాషిణికేసి తిరిగి) నమస్కారం! (కూర్చుంటాడు)

సుధా: తమరొచ్చిన పనేమిటో సెలవిస్తారూ మంగయ్యగారూ! ఏదోవిశేషం లేనిదే మీరిలా రారు.

మంగ: దయిచేసి నన్ను మంగయ్యని పిలవకండి. నా పేరు మంగేశ్వరరావు.

శేఖ: (అసలు వ్యవహారంలోకి వస్తూ) సరే! మంగేశ్వరరావుగారూ! మీరువచ్చిన పనేమిటి?

మంగ: రాత్రిమీరు ఆడిన "సంధ్యారాగం" నాటకం చూశాను. అద్భుతంగా వుంది. ఇటువంటి ఆదర్శనాట్య మండలి డబ్బులేక యిబ్బంది పడుతున్నదని తెలిసి చాలా విచారించాను.

సుధా: నాటకానికి ముందు మావిజ్ఞప్తి కూడా మీరు విన్నారన్నమాట!

మంగ: ఆఁ! అదివినేమీకు నేనుకొంత ధైర్యం కలిగించడంకోసం యిక్కడకు వచ్చాను. ఇక మీరు డబ్బుకోసం నిరుత్సాహపడకండి. నేను మీకు వీలైనంత వరకూ డబ్బు సర్దుతూ వుంటాను.

సుధా: (సంతోషంతో) మనఉపోద్ఘాతంవల్ల గుణం కనబడిందిరా కళాధర్!

కళా: (సంతోషంతో) మనకష్టానికి తగిన ప్రతిఫలం ఎప్పటికైనా దొరికి తీరుతుందిరా సుధాకర్!

సుధా: చూడండి మంగేశ్వరరావుగారూ! మీరు కళాప్రియులని తెలిసి మేము ఉభయులం చాలాసంతోషిస్తున్నాం. మాలాటి దరిద్రులకు ఎన్ని ఆశయాలు వుంటే ఏం లాభంచెప్పండి! మీవంటివారు మాఅండనువుంటే అంధ్ర నాటకరంగానికి ఆరువారాలలో ఆమోఘమైన కీర్తి తీసుకురాగలం.

కళా: అంతేకాదు. ప్రజలలభిరుచిని మూడునిమిషాలలో నాటకకళమీదికి మళ్ళించగలం.

సుధా: (లేచి) ఇం తెందుకు? నాటకాలవల్ల ప్రజల్ని తన్మయుల్ని చేసెయ్యగలం!

కళా: (లేచి) అపూర్వమైన సంస్కరణల్ని ప్రజల బుర్రలలో ఎక్కించగలం.

సుధా: ప్రేక్షకుల గుండెల్ని కరిగించగలం!

కళా: నవ్వించగలం: ఇంకా యేమైనా చెయ్యగలం.

(ఎడమవైపునుంచి శేషు వస్తాడు)

శేషు: ఏమిటిగురూ! ఇద్దరూఆవేశపూరితులై ఉపన్యసిస్తున్నారు? (మంగయ్యనుచూసి) ఓహో! మంగయ్యగారూ! ఇలావచ్చారేమిటి?

మంగ: (కోపంతో) మంగయ్యేమిటి? మంగేశ్వర్రావు అనలేవూ?

శేషు: ఏమిటి? మంకేశ్వర్రావా? ఇటువంటి పేరు ఎక్కడావినలేదే! ఇంగ్లీషులో 'మంకీ' అన్నపేరు విన్నాను. అయితే ఇంగ్లీషుభాషలోవున్న 'మంకీ' పదానికి తెలుగు భాషలోవున్న "ఈశ్వరుడు' పదానికి సంధి ఎలాకలిసిందాఅని నాకు సంశయంగావుంది.

సుధా: ఒరేయ్! శేషూ! నీసంశయాన్ని ప్రస్తుతంఆపు చేస్తే ఏమైనా ప్రమాదం వుందా?

శేషు:. లేదు.

సుధా: అయితే ఆపుచెయ్యి..

మంగ: రాత్రి నాటకంలో సుభాషిణి పాడిన పాట

యింకా నామనసులో కదులుతున్నదంటేనమ్మండి. కుమారి సుభాషిణిచేత ఒక్కసారి ఆపాటపాడిస్తారూ!

కళా: దానికేం? అలాగే వినండి! (సుభాషిణితో) అమ్మాయ్! మరొకసారి నీపాట మంగయ్యగారికి వినిపించు. (శేషుతో) ఒరేంయ్ శేషూ! మననాట్యమండలికి ఆర్థిక సహాయం చెయ్యడానికి మంగయ్యగారు ఒప్పుకున్నారు.కనక మేం యిద్దరం బయట చెట్టుక్రిందకూర్చుని రేపటినుంచి పెద్దఎత్తులలో నాట్యమండలిని ఎలా నిర్వహించాలో చర్చించుకొని వస్తాం. నువ్వుయిక్కడే కదలకుండా కూర్చో.

(కళాధర్ సుధాకర్ జట్టాపట్టాలు వేసుకొని ఎడమవైపు వెళ్ళిపోతారు.

శేషు: (తివాసీమీదకూర్చుని హార్మోనియంవాయిస్తూ గురువాజ్ఞ! ఏదీపాట ప్రారంభించు సుభాషిణీ!

(సుభాషిణికొంచెం సంశయిస్తుంది)

మంగ: పాడు! సుభాషిణీ! నాదగ్గరసంశయమెందుకు?

సుభా: (లేచిఉత్సాహంతో పాడుతుంది)

నాపాట వింటావా?

నాతో

నాట్యంచేస్తావా?

తీయని వలపుల పాటా

ప్రణయానికి ఋదిబాట

మదిని కదిపే ఆట

మెదలో ఒకపూదోట
మదిలో మదికలిపి
మెదలోమెద నిలిపి
జంటగ అటు పోదామా
మింటికెగసిపోదామా
నాపాట వింటావా?
నాతో
నాట్యం చేస్తావా?

మంగ: అద్భుతంగావుందిపాట! నీపాటసినిమాపాటల్ని మించిపోయివుంది. రాత్రి నాటకంలో మరోపాటకార్మికుల్ని గురించి పాడేవు చూశావూ! అది ఏడిసినట్టు వుంది.

సుభా: ఆపాటే అందరూ బాగుందన్నారండి.

మంగ: ఏడిశారు! వాళ్ళకేం తెలుసు పాటల మజా? నాకు చిన్నప్పటినుంచీ పాటలంటే ఎంతోయిష్టం. అందుకే నేను సినిమాకంపెనీ ఒకటిస్థాపించి ఒకచక్కనిపర్ణయచిత్రం తియ్యబోతున్నాను.

సుభా: (ఆశ్చర్యంతో) ఏమిటీ? మీరు సినిమా తీస్తున్నారా?

మంగ: ఏం? నీకాశ్చర్యంగా వుందా? ఒక టేమిటి? కొన్ని వందల సినిమాలు తియ్యగలను. అదికూడా వ్యాపారమేనని మానాన్నకు నచ్చజెపితే చివరకుసినిమాకంపెనీస్థాపించడానికి ఒప్పుకున్నాడు, (గదిపరికించి చూస్తూ) ఇదేమిటి

చీకటి కొట్టులావుంది. ఇంతేనా? ఇంకా ఏమైనా గదులున్నాయా?

సుభా: ఇంకా వెనక రిహార్సల్సు వేసుకోవడానికి పెద్ద హాలు, మరోగదీ వున్నాయి...రండి! చూపిస్తాను!

(ముందుసుభాషిణీ తరవాత మంగయ్య ఇద్దరి వెనుకా అనుమానంగాచూస్తూ శేషు కుడివైపు వెళ్ళిపోతారు క్షణం గది ఖాళీగా వుంటుంది. ఎడమవైపునుంచి కళాధర్ సుధాకర్ మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు)

కళా: భారీఎత్తున రిహార్సల్సు జరగడానికి పెద్దమేడ ఒకటి అద్దెకు తీసుకోవాలి. ప్రతినటుడికీ ప్రతిఫలం యిస్తూ వుండాలి.

సుధా: అంతేకాదు. రిహార్సల్సు జరగే సమయంలో కాఫీ ఫలహారాలు నటులందరికీ సరఫరా చెయ్యాలి.ఎవరైనా నటుడుకాని, కవికాని దరిద్రంతో .బాధపడుతూ వుంటే మనం నాటకం ఆడీ ఆ నాటకంవల్ల వచ్చే.నికరాదాయాన్ని వాళ్ళకు యిచ్చి సహాయం చెయ్యాలి.

కళా: మనం శ్రమపడి సుభాషిణిని హీరోయిన్‌గా తయారుచేసినందుకు ప్రతి ఫలం దక్కిందిరా! కుడివైపు నుంచి తొందరగా శేషు వస్తాడు)

శేషు: కొంప మునిగింది!

సుధా: వెధవముఖం నువ్వూ? మళ్ళీ ఏదోచావుకబురు తెచ్చావ్?

కళా: ఏం జరిగిందో వేగం చెప్పరా?

శేషు: మంకేశ్వరరావు సినిమాకం పెనీ పెడుతున్నాడట. దానికి సుభాషిణిని హీరోయిన్‌గా బుక్ చేసేశాడు. ఇద్దరూ రేపే విమానంమీద పట్నం వెళ్ళిపోతారట!

సుధా: (కోపంతో) హారి! దౌర్భాగ్యుడా! నాటకకళ మీద ఎంతో ప్రేమవున్నట్లు నటించి మననాటక మండలికి చిచ్చు పెట్టడానికి పూనుకున్నాడూ?.

కళా: (కోపంతో) ఒరేయ్ సుధాకర్! ముందుఆ మంగయ్యగాణ్ణి యిక్కడినుంచి తరిమెయ్యకపోతేలాభంలేదు. పద!.

(ఇద్దరూ ఆవేశంతో కుడివైపు వెళ్ళి చెరొక కర్ర తీసుకొని వస్తారు.)

సుధా: ఒరేయ్ కళాధర్! నువ్వుఅటువైపునుంచిరా!. నే నిటువైపునుంచి వస్తాను.

కళా: ఒరేయ్ సుధాకర్! తొందరపడి కర్రగట్టిగావిసిరేవు గనక! వాడిని యిక్కడినుంచి గెంటెయ్యడమే మనకు కావలసింది.

(కుడివైపు సుధాకర్ ఎడమవైపు నుంచి కళాధర్ తొందరగా వెళ్ళిపోతారు. శేషు ఆశ్చర్యంతో చూస్తూవుంటాడు. రెండునిముషాల తరవాత యిద్దరూ నిస్పృహతో కుడివైపునుంచి వస్తారు)

కళా: (కూర్చుని నిస్పృహతో) మన కళాసౌధాలు కూలిపోయాయిరా సుధాకర్!

శేషు: (ఆతృతతో) ఏరీవాళ్ళు?

సుధా: (కూచ్చుని నిరాశతో) ఎగిరే పోయారురా నాయనా! ఆమంగయ్యగాడు మనకొంప తీశాడు.

కళా: (బాధగా) ఎంతో శ్రమపడి మనం సుబ్బుల్ని సుభాషిణిగా మార్చాం. ఆంధ్రనాటక రంగానికి అద్భుత మైన కథానాయకిని సృష్టించియిచ్చాం. చివరకు మనకు దేశం యిచ్చిన ప్రతిఫలం యిదట రా సుధాకర్!

సుధా: ఒరేయ్ కళాధర్! మనం సుబ్బులుకు చదువు నటన చెప్పాంకాని, సంస్కారంప్రపంచజ్ఞానంనేర్పలేకపోయాం అందువల్లనే ఆమె మోసపోయి వెళ్ళిపోయింది. ఇక కుమారి సుభాషిణికి ఒక నమస్కారం పెట్టేసి వూరుకో!

శేషు: (ఇంతవరకు ఆత్రంతోను, బాధగానూ వింటూ యిక భరించలేక) సుభాషిణిని నేను మనసారా ప్రేమించాను ఆమె లేని యీనాట్యమండలిలో నేను ఒకక్షణమైనా వుండ లేను. (ఆవేశంతో) ఆమంగయ్యగాడిబుర్ర రామకీర్తన పాడి స్తాను. తిరిగి సుభాషిణిని తీసుకురాకుండా నేనీనాట్యమండలి లో అడుగుపెట్టను. (ఉద్రేకంతో ఎడమవైపు పోతాడు) కళాధర్ సుధాకర్ యిద్దరూ "శేషూ!" "శేషూ!" అని పిలుస్తూ వుంటారు – తెర)

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక – 1–12–54.

---

